శ్రీ గాంధి మహాత్ముని

# సత్యాన్వేషణ ప్రబోధములు.

నిర్మాణ కార్యక్రమ కేంద్రమువారిచే
ప్రచురింపబడినది
జొన్నలగడ్డ.
1941.

మొదటి కూర్పు ౧౦౦౦ ప్రతులు.

కౌముదీ ముద్రాక్షరశాల,
నరసరావుపేట.

# విషయసూచిక.



# తొలి పలుకు.

శ్రీ మహాత్మా గాంధిగారి చేత నప్పుడప్పుడు సందర్భోచితముగ రచియింపబడిన వ్యాసములును ఇతరులతో వారుజరిపిన సంభాషణలును కొన్ని యొక్కటిగ జేర్చి ఒక్క చిన్నపుస్తకముగ ప్రకటించుట పలువురకు మిక్కిలి యుపయుక్తమగుటకు సంశయములేదు. అందునివి తెలుగున అనువదింప బడినవగుటచేత తెలుగువారికి చాల మేలుగూర్చుచున్నవి. వానినియాపుస్తకరూపమునప్రకటించిప్రచారముగావింపబూనిన నర్సరావుపేటతాలూకాజొన్నలగడ్డ "నిర్మాణకార్యక్రమకేంద్రము" వారు మిక్కిలి ధన్యులును వదాన్యులు ననుట యతిశయోక్తిగాదు.

ఈ వ్యాసరాజములు అమూల్యరత్నములు మానవ జీవితోన్నతికి పరమసాధనములు. భారతీయులకు పరమ గణ్యములు.

ఇందు వర్ణాశ్రమ ధర్మములు మానవసంఘమునకు శాంతిసౌఖ్యములను సమకూర్చుటకు తపోధన్యులగు మహర్షులు దివ్యదృష్టిచేత నిర్మాణముగావించిన స్వర్గసోపానములనియు అవి చాలాపరకు విచ్ఛిన్నములగుటచేత భారతజాతిదుర్గతిని పొందవలసి వచ్చినదనియు నిరూపించబడినది.

అహింసా తత్త్వము వర్ణించుటలో నిష్కళంక విశుద్ధాంతఃకరణమునుండి జాలువారు దయారసము నెల్ల భూతముల యెడలను ఎల్లకాలమునందును ఎట్టి పరిస్థితులలో నైనను భావములందును కార్యములందును ప్రసరింపజేయు ప్రేమచంద్రుడనదగిన ఉత్తమ పురుషుని యనుష్ఠాన మార్గము సూచింపబడినది.

భగవతోపాసన, ప్రార్థన మొదలగు వానిని గూర్చిన సంభాషణలలో జీవేశ్వరపరమేశ్వరు లొక్కటియే యను ఉన్నత భావము మనస్సున స్థిరత్వము గాంచకపోవుటచేత పరమేశ్వరుడు తనకు వెలుపల నున్నట్లే భావించిననూ తాను అనుక్షణము ఆయన సాన్నిధ్యముననే యున్నట్లు మెలంగుచు మనోవాక్కాయ కర్మలన్నియు ఆయనవశము గావింప ప్రయత్నించుచు తాను సంకల్పించగా సిద్ధించిన కార్యములన్నియు ఆ పరమాత్ముని యనుగ్రహమువలననే సిద్ధించినవని విశ్వసించుచు కష్టములు చుట్టుముట్టుకొని గాఢాంధకారము గప్పి దారి తెన్ను తెలియని మహోపద్రవ సమయములో నున్నప్పుడు సహానము పరమేశ్వరుడు చేయూత నొసగి దారిచూపుచుండుటయు తన కనుభవవేద్యమయిన మహాభాగ్యమనియు మహాత్ముడు తానభ్యసించెడి భగవదోపాసన మార్గము వెల్లడించెను.

స్త్రీధర్మములు వివరించుచు స్త్రీపురుషులలో నిజమగు భేదము లేకున్నను వారివారి ధర్మములు వేరువేరుగా నున్నవని వక్కాణించి బిడ్డలను కని పెంచి వంశలతను సాగించి పోషణాదికముల నిర్వహించుచు భగవంతుని సృష్టిస్థితికార్యముల కనువగు సాధనముగ బ్రవర్తించుట స్త్రీలకు సహజ ధర్మమనియు ఇంటిలోపలి పనుల చక్కబెట్టి ఇంటిని నిహలోక స్వర్గముగ జేయు నైపుణ్యము గృహిణికమూల్య భూషణమని సూచించిరి.

ఇట్లు పలువిధములగు హంశములనుగూర్చిలోక పూజ్యులగు మహాత్ముని చెంతజేరి వారి సద్బోధస్వయముగ వినినట్లే యీ వ్యాసములు చదివిన వారికి తోచక మానదు.

మరియు నిందుతో చేర్చబడిన నిర్మాణ కార్యక్రమమును గూర్చిన వ్యాసములలో దేశమున గాంధి తత్త్వము వ్యాపింపచేయుటకు సాధనరూపకమగు అనుష్ఠాన క్రమము తెలుపబడినది. దేశముయొక్క ఆర్థికాభివృద్ధికిని నైతికోన్నతికిని స్వరాజ్య లబ్ధికినిగూడ ఈ నిర్మాణ కార్యక్రమము ముఖ్యసాధనము. ప్రకృతము మహాత్మునిచే సాధించబడుచున్న సత్యాగ్రహోద్యమమునకు నత్యంతావసరమైన శిక్షామార్గము.

ఈ శిక్షణమున సిద్ధిబడిసినవారే సత్యాగ్రహము సాగించుట కర్హులు.

కాన యీ చిన్నపుస్తకమును ఎల్లరును శ్రద్ధతో చదివి అందలి ధర్మబోధను చక్కగ గ్రహించి యనుష్ఠించి కృతకృత్యులగుదురుగాక.

గుంటూరు, 12-7-41. } కొండ వెంకటప్పయ్య.

---

"సమానీప్రపా సహవో అన్నభాగాః
సమానే యోక్త్రే సహవో యునజ్మి
సమ్యంచో అగ్నిం సపర్యత
అరానాభిరివ ఆవృతాః"

అన్నపానీయములు అందరు సమముగ అనుభవింపుడు. సంసార (ప్రపంచ)భారము అందరును సమముగ వహింపుడు. బండి కంటిన ఆకులవలె అందరును నన్ను సమభావమున పొంది ఆరాధింపుడు.

—అధర్వవేదము.

శ్రీ

# గాంధి మహాత్ముని "సత్యాన్వేషణ" వ్యాసరాజములు.

## వర్ణాశ్రమ ధర్మములు.

వర్ణ ధర్మములను ఆశ్రమ ధర్మములును వేరే వైనను ఈ రెండింటికిని కలిపి వర్ణాశ్రమ ధర్మమనియే అందరును సమిష్టి పదముగా పలుకుచుందురు. దీనినే హిందూ మతమనిగూడ నందురు. కాని హిందూ శబ్దము సమగ్రమైనది కాదు. హిందూ అను పదము భూగోళమునకు సంబంధించినది. ఇది విదేశీయులు కల్పించినది. హిందువులు నెరవేర్చవలసిన ధర్మము వర్ణాశ్రమధర్మము. హిందూధర్మము ఆర్య ధర్మమని తెలిపినచో విషయము పూర్తిగా తెలియదు. హిందువులు సింధు నదికి తూర్పు ప్రదేశమున ఆర్యులను పేరుతో నివసించుచుండిరి. ఈ దేశమునందు నివసించుచున్న యితరులనందరిని అనార్యులని వారు పిలచుచుండిరి. అని దీనివలన తెలియును గాని ఇది ప్రజలకు దురభిప్రాయమును కలుగ జేయును. హిందువుల ముఖ్యధర్మమును లక్షణమును స్పష్టముగా తెలుపునట్టి పేరుండవలెను. వర్ణాశ్రమ ధర్మానుసరణమే హిందువులకు ముఖ్య లక్షణము. కావుననే అన్ని స్మృతులలోను గూడ వర్ణాశ్రమ ధర్మమును గూర్చి విస్తా

రముగా వ్రాయబడెను. అతి ప్రాచీనములగు వేద ములలో గూడ వర్ణాశ్రమ ధర్మమును గూర్చి తెలుప బడెను. కావున హిందువునని చెప్పుకొను వా డెవ్వడు ను గూడ వర్ణాశ్రమ ధ ర్మ ము ల ను తృణీకరింప వీలులేదు. హిందువు లందరును వర్ణాశ్రమ ధర్మము యొక్క మూలస్వరూపమును సరిగా తెలుసుకొనవలె ను. అది సర్వ జనీనమగు ధర్మమే యగునెడల దాని పవిత్రతను కాపాడవలెను. కాలక్రమమున దానిలో చేరిన అసంగతాచారములను పరిహరించవలెను.

## ప్ర స్తు త స్థి తి.

ఇపుడు ఆశ్రమ ధర్మమును ప్రజలు సరిగా నెరవేర్చుట లేదు. బ్రహ్మచారి (ఇంద్రియ నిగ్రహ ము గల విద్యార్థి,) గృహస్థుడు (భార్యతో కాపురము చేయువాడు,) వానప్రస్థుడు (గృహస్థ ధర్మమును వదలుట నభ్యసించువాడు,) స న్యా సి (సర్వమును పూ ర్తిగా వదలినవాడు) యీ నాలుగాశ్రమముల ధర్మ ములను జీవితార్థమును బడయగోరు హిందువులందరు ను నెరవేర్పవలెను. ఇపుడు బ్రహ్మచర్య వానప్రస్థ ధర్మములను సరిగా నెవ్వరును నెరవేర్చుటలేదు. అంద రును గృహస్థులేగాని యీ పేరు వారికి నామమాత్ర మే గాని సార్థకముగాదు. మన మందరమును ఆహార మును తినుచు నీరు త్రాగుచు భార్యలతో సంభోగించుచు

బిడ్డలను కనుచున్నాము. ఈ మూడు పనులును మను
ష్యులు మాత్రమేగాక పశుపక్షి క్రిమికీటకాదులు గూడ
నెరవేర్చుచునే యుండును. ఈ పనులు తాత్కాలిక
ముగా శరీర సుఖమును కలిగించును గాని జీవునకెట్టి
శాశ్వత సుఖమును కలిగింపవు. అగ్నిసాక్షిగా వివా
హితులయిన దంపతులలో అస్థిరములగు నైహిక
సుఖముల నపేక్షింపకుండ శాశ్వతమగు నాముష్మిక
సుఖము కొరకు మాత్రమే పని చేయుచుండు వారికే
గృహస్థులను పదము సార్థకముగాని కేవలము భౌతిక
సౌఖ్యములనే బడయగోరువారు గృహస్థులనుట కర్హు
లుగారు. ఇపుడు గృహస్థు లనబడువారిలో మిక్కిలి
హెచ్చుమంది భోగలాలసులుగానే యున్నారు. మను
ష్యుని జీవితమను సౌధమున కివి నాలుగును నాలుగు
మెట్లుగను. వీటిని క్రమ క్రమముగా నెక్కి పైకి వెళ్ల
వలెనేగాని క్రిందనుండిఒక్కసారిగా పైకెగురుట అసం
భవము. బ్రహ్మచర్య గృహస్థ ధర్మములను సరిగా
నెరవేర్చిన పిమ్మట వానప్రస్థమునందు త్యాగమును
బాగుగా నలవరచుకొని పిమ్మట సర్వసంగ పరిత్యాగ
మొనరించి సన్యాసి కావలెను. దీనినిబట్టి చూచినచో
నేడు ఆశ్రమధర్మము నేడుఆచరణలోలేదని స్పష్టముగా
చెప్పవచ్చును. ఆశ్రమధర్మమునకు వర్ణ ధర్మమునకును
అవినాభావసంబంధమున్నది వర్ణధర్మమును మరల ఆచ

రణలో బెట్టిననేగాని ఆశ్రమ ధర్మమును ఆచరణలో పెట్టుటకు వీలులేదు.

ఇపుడు వర్ణ ధర్మ మున్నది గాని అవిచ్ఛిన్న దశలో నున్నది. ప్రధానమైనవి నాలుగు వర్ణములే యైనను విచ్ఛిన్న దశవలన నేడు వీటిలో అనేక అవాంతర విభాగము లేర్పడినవి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్ణములకు చేరినవారు ఆయా వర్ణములవారని చెప్పుకొనుట అవమానకరమని భావించుటలేదు గాని శూద్ర వర్ణమువారు శూద్రులమని చెప్పుకొనుట అవమానకరమనియే తలచుచున్నారు.

ఈ వర్ణ విభేదములను బట్టి ఒకడు సద్వర్తనుడా దుర్వర్తనుడా అను విషయము తెలియదు. బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు అని పిలువబడు వారు ఆయా వర్ణములలోనుండుట కర్హులని చెప్పుటకు గూడ వీలులేదు. నల్లని చాయగలవాడు ఎన్నిసారులు తాను ఎఱ్ఱగా నున్నానని చెప్పుకొనినను వాని నలుపు రంగు పోదు. నేను బ్రాహ్మణుడనని ఒకడు చెప్పుకొనినంతమాత్రమున నతడు బ్రాహ్మణుడు కాజాలడు. బ్రాహ్మణ లక్షణము లెవని జీవితములో వెంబడియగునో అతడే బ్రాహ్మణుడగును. ఈరీతిగా పరీక్షించినచో వర్ణ వ్యవస్థగూడ నిపు డంతరించినదనియే చెప్పవలసి యుండును మనమందరము శూద్రులమని చెప్పుకొందము.

మనము శూద్ర ధర్మమును గూడ నెరవేర్చుటలేదు. కావున దానికిగూడ మన కర్హతలేదు. లేకపోయి ననుగూడ శూద్రులమని చెప్పుకొనవచ్చును. మనము స్వధర్మమును విధిగాను మనఃపూర్వకముగాను నెరవేర్పవలెను. దానివలన మనకు ఘనతయును కలుగదు అవమానమును కలుగదు. ఈ రీతిగా స్వధర్మము నిపుడు నెరవేర్చుచున్నవా రెందరున్నారు? విధి లేకపోవుటచే దానియందు మనకు నమ్మకము లేకపోయినను దాస్యభావముతో మనముదానిని నెరవేర్చుచున్నాము. ప్రతివర్ణములోను యెవరో కొందరు ఏదో యొకరీతిగా వర్ణధర్మము నిపుడుగూడ నెరవేర్చుచునే యున్నారు గాన వర్ణధర్మ మిపుడుగూడనున్నదని యెవరును చెప్పగూడదు. వర్ణమునకును జన్మకును అవిచ్ఛేద్య సంబంధము లేకపోయినను అతి సన్నిహితమగు సంబంధము కలదు. కావున వర్ణధర్మమును సరిగా నెరవేర్పగోరువారు అది తమ ముఖ్య కర్తవ్యమని తెలుసుకొని తమ తాత తండ్రులు నెరవేర్చుచుండిన దానినే సరిగా నెరవేర్పవలెను. ఇపుడటుల నెరవేర్చెడివారి సంఖ్య అత్యల్పము. ఈరీతిగా మన వర్ణాచార ధర్మమును నెరవేర్చుట మన విధియని భావించి మనము నెరవేర్చుచుండుటవలన నది మనకు జీవనాధారముగూడనగును. బ్రాహ్మణుడు శ్రుతి స్మృతి పురాణాదులును గురుముఖ

మున నేర్చుకొని యితరులకు నేర్పుచుండవలెను. అది అతని వర్ణాచారధర్మము. అందువలన నతనికి జీవనాధారము జరుగునుగాని తన విధిని తాను నెరవేర్చుటవలన భగవత్ప్రీతి కలుగుననియే అతడు దానిని నెరవేర్చునుగాని అందువలన తనకు జీవనాధారము జరుగునని నెరవేర్పడు. అందువలన నతనికి జీవనాధారము జరుగునెడల అది భగవదనుగ్రహము వలననే కలిగినదని అతడు భావించి దానితో సంతుష్టుడగును గాని తన ప్రయోజకతవలన కలిగినదని భావింపడు. ఈ రీతిగానే క్షత్రియుడు ప్రజలను రక్షించును. అది అతని స్వధర్మము. ప్రజలు మనఃపూర్వకముగా తన కిచ్చెడుదానిని భగవత్ప్రసాదమని స్వీకరించి దానితో సంతుష్టుడగును. వైశ్యుడు ప్రజలమేలుకొరకు ధనార్జన సాధకములగు వృత్తుల నవలంబించును. దానివలన లభించెడు ధనములో తన కుటుంబపోషణ కెంత యవసరమో అంతధనమును మాత్రమే తనయొద్ద నుంచుకొని తక్కినధనమునంతను యేదోయొక రూపమున భగవత్ప్రీత్యర్థము ప్రజలకు ముట్టజెప్పుచుండును. ఇట్టి భావముతోనే శూద్రుడు ఇతరులకు సేవజేయును అది భగవత్సేవయే యని భావించును.

## వర్ణము జన్మసిద్ధమా?

వర్ణము జన్మమువలననే గలుగును గాని వర్ణ

ధర్మమును సరిగా నెరవేర్చకపోయినచో నది తొలగి పోవును. బ్రాహ్మణకుటుంబమున పుట్టినవాడు బ్రాహ్మ ణుడనబడునుగాని వానికి యౌవనము వచ్చినప్పుడు

ఆహారమునుతినుట పానీయములను త్రాగుట స్త్రీ సంభోగము వీటిని గూర్చి నిరోధము ఉండ నక్కరలేదని నేను తెలుపుటలేదు. ఇతరులిచ్చిన ప్రతి వస్తువును తినగూడదు. మనతోనున్నవా రెవ్వరైనను సరే వారి మధ్యను గూర్చుండి భుజింపవలెనని నేనెంత మాత్రమును తెలుపను. తన కంటికి అందముగా కను పడినంతమాత్రమున ఒకస్త్రీని ఒక యువకుడు కుల గోత్రములను తెలుసుకొనకుండ పెండ్లియాడగూడదు. మనముచేయు ప్రతికార్యమునకును మితిఅనగా నిరోధ ముండవలెను. ఆహార నియమములున్నవి. జంతువుల వలె మనుష్యుడు ప్రతివస్తువును తినగూడదు. కనబడిన స్త్రీని పెండ్లియాడగూడదు. గాని వర్ణధర్మమునకును వివాహ విధులకును నెట్టి సంబంధమును లేదు. వేరు వేరు వర్ణములవారిలో వివాహములు జరుగవచ్చును. వేరువేరు వర్ణములవారు కలసి భోజనముచేయవచ్చును. పూర్వకాలములో నిటుల వర్ణాంతర వివాహములును సహపంక్తిభోజనములును జరుగుచునేయుండెను.వీటిని గూర్చి ఇప్పటివలె కఠిన నియమము లప్పుడులేవు. ఈ కఠిననియమములను తెచ్చిపెట్టుట వలన హిందూసంఘ

మునకు చాల నష్టముకలిగినది.

## వర్ణధర్మద్రష్ట

వర్ణధర్మమును మన దేశమున హిందువులలో నెవరో యొక ద్రష్ట కనుగొనిన మాట నిజమే గాని యితర జాతులలో గూడ నిట్టి విభేదములు కలవు. ఇతర జాతులవారు హిందువులవలె వర్ణ ధర్మమును అంగీకరింపకపోయినను అన్నిజాతులలో గూడ నేదో యొక రూపమున వర్ణధర్మముకలదు. కావుననే నేను వర్ణధర్మము విశ్వవ్యాప్తమని అంగీకరించుచున్నాను. ప్రతిమనుష్యుడును తన కులవృత్తినే అనుసరించుచుండ వలెను. కాని అవృత్తి సనాతన నైతిక సూత్రములకు విరుద్ధముగానున్నచో తన తాత తండ్రులు దానిని నెర వేర్చిరను కారణమున నొకడు దానిని నెరవేర్పగూడదు. లేనిచో కులవృత్తినే అవలంబించవలెను. దానివలన వచ్చిన ఆదాయమును నిలువచేయకుండ పరోపకార నిమిత్తము వ్యయపరుచుచుండవలెను.

వేదములలో నాలుగువర్ణములను నాలుగుఅవయవ ములతోపోల్చుట మిక్కిలి శ్రేష్ఠమైనఉపమానము. ఇవి నాలుగును ఒక శరీరములో అవయవములైనచో వీటిలో నెచ్చుతగ్గు లెటుల కలుగును? ఒకని శరీరములోని అవయవములకు మాటలాడగలశక్తియుండి నేనుగొప్ప నేనుగొప్ప అని అవియన్నియును జగడమాడు నెడల

ఆ శరీరమువెంటనే నేలగూలును. అటులనే సంఘము లోని నాలుగువర్ణములవారును మేముగొప్ప మేము గొప్ప యని జగడమాడునెడల హిందూ సంఘమునకు వినాశము కలుగును. ఇప్పుడు మనదేశమున హిందూ సంఘము దుస్స్థితికి పాల్పడుటకు వివిధ వర్ణములవారికి గలిగిన ఆధిక్య రూపకమగు దురభిమానమే ముఖ్యకారణము. అందరును వర్ణధర్మము సరిగా నెరవేర్చినగాని ఈ వివాదములు తొలగవు. ఒక వర్ణమువాడు తన కుల వృత్తిని నెరవేర్చుట వానివిధియనియే దానిని నెరవేర్చవలెనుగాని ధనముకొరకుగాదు. దానివలన ధనము వచ్చునుగాని అది వేరు. ఒక బ్రాహ్మణుడు బ్రాహ్మణ ధర్మములను సరిగా నెరవేర్పకపోయినచో అతడు బ్రహ్మబంధుడగునుగాని బ్రాహ్మణుడుగాడు. ఇతర వర్ణములలో పుట్టినవాడు బ్రాహ్మణ ధర్మమును సరిగా నెరవేర్చుచున్నచో అతడు బ్రాహ్మణుడనియే యితరులు గౌరవించెదరు గాని బ్రాహ్మణుడని పిలువబడుట కతడంగీకరించడు.

కావున వర్ణధర్మము మనుష్యకల్పితముగాదు. అది హిందువులకు మాత్రమేగాక ప్రపంచమున మనుష్యుల కందరికిని వర్తించును. వర్ణధర్మమును ప్రజలందరును సరిగా నెరవేర్చునెడల జీవితము సుఖప్రదమగును. దేశమున శాంతియును తృప్తియును యేర్ప

పును. కలహాములు కొట్లాటలు కఱవులు కాటకములు ప్రజలకు తిండిలేకపోవుట ప్రజలు ధనహీనులగుట వ్యాధులు బాధలు జనసంఖ్య అధికమగుట మున్నగున వేవియును కలుగవు.

వర్ణము జన్మమున కలుగును గాని వర్ణమువలన ఆధిక్యముగాని నీచస్థితిగాని కలుగవు. సంఘమునకు అన్ని వర్ణములును సమానములేకావున అగ్రవర్ణము అంత్యవర్ణము అను విభేదముండగూడదు. ఇపుడు వర్ణ వ్యవస్థయందు విభేదమే ప్రధాన లక్షణముగా నేర్పడినది. మన ప్రాచీనులనిర్ణయమిపుడు పూర్తిగా వ్యత్యస్థమైనది. మన ప్రాచీనులు కఠినమగు తపము సలిపి వర్ణవ్యవస్థను దివ్యదృష్టివలన కనుగొనిరి. వారు దానిని శక్తివంచన లేకుండ నెరవేర్చిరి. మనము దానిని పూర్తిగా మార్చివేసి ప్రపంచమున హాస్యాస్పదులమైతిమి ఇది హిందూ సంఘమును రూపుమాపునను నభిప్రాయయముతో హిందువులలో నొక తెగవారిపుడు దీని నంతరింపజేయుటకు సర్వశక్తులను వినియోగించుచున్నారు.

విషయము-

మనుష్యులలో అధికసంఖ్యాకులిటుల తమతమకుల వృత్తులనే నెరవేర్చుచున్నచో వివాదము లంతరించును. అన్నివృత్తులకును సమాన గౌరవములే యగును. ఆముష్మిక విషయములను దైవమునుగూర్చి బోధించుట,

న్యాయవాదవృత్తి. వైద్యవృత్తి. చెప్పులుకుట్టుట, వడ్రముపని, వీధులుతుడుచుట, వర్తకము, వ్యవసాయము, సైనిక వృత్తిమున్నగు వృత్తులన్నియును గౌరవప్రదములే యగును. ఇపుడుబ్రాహ్మణులు పర్ణశాలలలో తృప్తి నొందుచున్నారు. క్షత్రియ వైశ్యులు ధనవంతులయి భోగముల ననుభవించుచున్నారు. శూద్రులు ఈ మూడు వర్ణములవారి కొరకును కష్టపడి పని చేయుచు పందుల గుడిసెలలో దలదాచుకొనుచున్నారు. ఇది సరియైన వర్ణధర్మముగాదు. వర్ణధర్మము విచ్ఛిన్నమగుటవలననే యిపుడిట్టిస్థితి కలిగినది.

## భారత దేశ స్థితి

వర్ణధర్మము యిండియాలో నెపుడైన సరియైన స్థితిలో నుండెనో లేదో నాకు తెలియదు. కాని అదియె శ్రేష్ఠమైనదిగాన ప్రపంచమం దన్నిజాతులవారునుగూడ వర్ణధర్మమును సరిగా నెరవేర్పదగును.

అపుడు సొత్తులన్నియును ప్రజలవేయగును. సొత్తులుకలవారు ప్రజలకు ట్రస్టీలగుదురు. ఈ పొలము నాదియని యెవరును చెప్పజాలరు. రాజు నివసించు కోట ప్రజలదే అతడు కప్పములను వసూలుచేయుట ప్రజల కొరకు వ్యయపరచుటకే అతనికెంత యవసరమో అంతకంటె నతడు తన కుటుంబ నిమిత్తము వ్యయపరుపఁగూడదు. తక్కిన ధనమునంతయు ప్రజల

మేలుకొరకే వ్యయపరుపవలెను. రాజు యితరవిధము లుగా గూడ ధనమును సమాకూర్చవలెను. దానిని తమ ప్రజలకొరకే వ్యయపరుపవలెను. వైశ్యుడుగూడ ప్రజలకు ట్రస్టీయే శూద్రుడుగూడ నటులే శూద్రుడు తన ధర్మమును సరిగా నెరవేర్చునెడల అతడు దేనిని గూడ యిది నాది అని అనడు అతడు దేనిని బడయ గోరడు తాను భగవత్సేవ జేయుచున్నానను భావముతో యితరులకు కష్టపడి పనిచేయునుగాని అతడు సర్వసంగ పరిత్యాగిగాన అతడే సర్వస్వామి గాన అందరికంటెను అతడే పూజ్యుడగును. తక్కినవారికంటె తానే పూజ్యుడ ననిపించుకొనుటకు స్వధర్మనిరతుడగు శూద్రు డెన్నడు ను అంగీకరింపడు. నేను దాసుడననియే అతడు తెలు పునుగాన దేవత లతని నాశీర్వదించుచుందురు.

ఇపుడు ప్రపంచమున కార్మికులు మున్నగు జన సామాన్యమునకు సొత్తులు లేవుగాని వారు సొత్తులను కోరుచున్నారు వారు యంత్రశాలలలో పనిచేయుటలో మనఃపూర్వకముగా నది తమవిధియని చేయుటలేదు. ధనముకొరకు చేయుచున్నారు. అటుల పనిచేయుటవలన వారి శరీర సౌఖ్యములకు చాలినంత ధనముగూడ వారికి లభించుటలేదు. గాన వీరందరును స్వధర్మనిరతు లగు శూద్రులు కాజాలరు. స్వధర్మనిరతుడగు శూద్రు డనుగా నుండవలెననియే నేను ముఖ్యముగా కోరు

ఉన్నాను ఆదర్శప్రాయమగునట్టి శూద్రుడనే నేను ప్రశంసించుచున్నాను.

నీవు శూద్రధర్మమును నెరవేర్పవలెనని యితరులు విధింపరాదు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు తమకుగల సొత్తులు ప్రజల సొత్తురేయనియు వాటికితాము ట్రస్టీలమనియు తెలుసుకొని వాటిని ప్రజల నిమిత్తము వినియోగించుచు స్వధర్మములను సరిగా నెరవేర్చుచు తాము ప్రజల సేవకులమని భావించుచుండు నెడల వారుమాత్రమే యిటుల విధింపవచ్చును. యేవర్ణము వారును గూడ వర్ణధర్మమును సరిగా నెరవేర్చుటలేదు. కాని శూద్రునికంటె వైశ్యుడును, వైశ్యునికంటె క్షత్రియుడును, క్షత్రియునికంటె బ్రాహ్మణుడును పూజనీయులు అను అభిప్రాయముమాత్రము ప్రజలలో ఏర్పడినది. ఇట్టి స్థితిలో శూద్రులకు తక్కిన మూడు వర్ణములవారియందును యీర్ష్య కలుగుట సహజమే. వర్ణధర్మమును మనఃపూర్వకముగా నెరవేర్పవలెనుగాని నిర్బంధమువలన నెరవేర్పగూడదు. మనఃపూర్వకముగా నెరవేర్చిననే లోకమునకు మేలుకలుగును.

ఇపుడు ప్రతివిషయములోను పోటీ చాల అధికమైనది. ధన మధికముగా కలవాడే హెచ్చుగా గౌరవింపబడుచున్నాడు. ఎవరికి ఇష్టమైనవృత్తిని వారవలంబించుచున్నారు. ఇట్టి స్థితిలో ఆదర్శప్రాయముగా వర్ణ

ధర్మమును గూర్చి బోధించుటయును దానిని మరల అమలులో బెట్టగోరుటయును అవివేకముగానే కనబడును. అది యెటులుండినను నిజమైన సాంఘికత్వము (సోషలిజము) వర్ణధర్మమేయని నేను గట్టిగా నమ్ముచున్నాను. భగవద్గీతలో అన్నిజీవులలోను భగవంతుడు సమానముగా నున్నాడని తెలుపబడెను. వర్ణధర్మమును సరిగా నెరవేర్పబూనుటవలన మనుష్యులకందరికి గూడ మేలుకలుగును.

నాల్గు వర్ణములున్నవని తెలుపబడినను ఆసంఖ్యను మార్చగూడదనినేనను ఇటుపైని సంఘనిర్మాణము చేయుటలో వర్ణములసంఖ్యను హెచ్చింపవచ్చును లేదా తగ్గింపవచ్చును. ఒకవర్ణమువాడు తన కులవృత్తినే అవలంబించవలెనను నదియే వర్ణధర్మమునకు ముఖ్య నియమము.

మిధిలా బ్రాహ్మణుని సందేశములు

"మిధిలాదేశవాసియగు నొక బ్రాహ్మణుడు హిందీభాషలో నొక దీర్ఘమగు లేఖ వ్రాసెను. అతని లేఖలో ఎనిమిది ప్రశ్నలున్నవి. అవి మనుష్యుల కందరికిగూడ ముఖ్యమైనవే. ఈ బ్రాహ్మణుడు పూర్వాచార పరాయణుల కుటుంబమునకు చేరినవాడైనను హరిజనులపట్ల నెట్టి నిరసనభావమును వెల్లడించలేదు.

"ఇదివరకు సవర్ణులుమాత్రమే ఉపయోగించు

చున్న నూతిలోని నీటిని పరిశుభ్రముగా నున్నవారందరును వారేవర్ణమువారైనను గూడా వాడవచ్చును" అని యితడు తెలిపెను.

— బ్రాహ్మణుని ప్రశ్నలు —

• మహాత్ముడిచ్చిన ప్రత్యుత్తరములు •

ప్రశ్న "అస్పృశ్యతను తొలగింపవలెనని మీరు కోరుచున్నారు. మీరు పరిశుభ్రముగా నుండవలెను. చచ్చిపోయిన జంతువుల మాంసమును తినగూడదు" అని హరిజనులకు గూడ మీరేల బోధింపరు?

ప్రత్యు॥ "మీరు పరిశుభ్రముగా నుండవలెను. చచ్చిపోయిన జంతువుల మాంసమును తినగూడదు. కల్లు సారా మున్నగు నిషా వస్తువుల నుపయోగించగూడదు. మీరు చదువుకొనవలెను. మీ బిడ్డలకు చదువు చెప్పించవలెను. సవర్ణులు వీథిలో తిని పారవేసిన ఎంగిలి విస్తళ్లలో మిగిలిన వస్తువులను మీరు తినగూడదు" అని నేను హరిజనులకు బోధించుచునే యున్నాను. గాని దురలవాటులు హరిజనులకు సహజముగా కలిగినవిగావు. సవర్ణులు బుద్ధిపూర్వకముగా వారిని నీచస్థితికి పాలుచేయుటవలనను వారిట్టి సహాయము చేయక పోవుటవలనను వారిట్టి స్థితికి పాల్పడిరి. కావున సవర్ణులు ముందుగా వారిని చేరదీసి వారి దుస్థితి తొలగుటకు సహాయముచేయవలెను. అటుల చేసినచో వారుగూడ

సవర్ణులవలెనే మనపద్ధతుల నభ్యసించెదరు. సవర్ణులు ఇదివరకు హరిజనులపట్ల చేసిన అన్యాయమును గూర్చి పశ్చాత్తాపము జెంది వినయతతో వారిచెంతకు వెళ్లవలెనుగాని వారికి మహోపకారమును చేయుచున్నామను అహంకారముతో వెళ్లగూడదు. సవర్ణులు చేసిన ప్రాయశ్చిత్తములలో నిది మిక్కిలి తక్కువ ప్రాయశ్చిత్తము.

ప్రశ్న॥ సనాతన హిందువులకు ముఖ్య లక్షణమేమి? నేను సనాతనుడనని మీరేల చెప్పుకొనుచున్నారు?

ప్రత్యు॥ హిందూధర్మములో వర్ణాశ్రమధర్మమును విశ్వసించి దానిననుసరించుట ముఖ్యతమము. శాస్త్రములలో తెలుపబడు విషయములను నేను గ్రహింపగలిగినంతవరకు సరిగా నెరవేర్చుటకు నేను ప్రయత్నించెదను గాన నేను సనాతనహిందువునని తలంచుచున్నాను.

ప్రశ్న॥ వంశ పారంపర్యముగా వచ్చుచున్న వృత్తిని ఒకడు అతిక్రమించినచో వర్ణవ్యవస్థలో వ్యత్యస్తము కలుగునని మీరు తెలిపితిరి. భగవద్గీతలో ప్రథమాధ్యాయమున గూడ వర్ణవ్యవస్థయను పదము వాడబడెను. ఆ సందర్భమునుబట్టి ఆ పదమునకు చెప్పదగిన అర్థమునను మీ యభిప్రాయము సంగతముగానున్నదా?

ప్రత్యు॥ తన తాతతండ్రులు నెరవేర్చుచున్న వృత్తి నొకడు వదలివేసినచో సంఘమునందు వ్యత్యస్తము కలుగుట నిశ్చయమే. ఒక బ్రాహ్మణుడు మంగలిపని

గాని ఇంజనీరుపనిగాని చేయ నారంభించినచో వర్ణ వ్యత్యాసము కలుగును. ఒక మంగలిగాని ఒక ఇంటి పనిగాని వేదశాస్త్ర పురాణాదులను బోధింప బూనినను గూడ వర్ణవ్యత్యాసము కలుగును. స్త్రీలు దుష్టవర్తనులైనచో వర్ణ సంకరము కలుగునని భగవద్గీతలో తెలుపబడెను. గాన వ్యభిచారముచేయుటచే కలిగిన సంతానమువలన వర్ణసంకరము కలుగునుగాని భార్యా భర్తలకు కలిగిన సంతానము వలన వర్ణసంకరము కలుగదు.

ప్రశ్న॥ ఒక బ్రాహ్మణస్త్రీ ఒక శూద్రుని పెండ్లియాడు విషయమున స్మృతులలో నున్న శ్లోకములనుగూర్చి మీరేమి చెప్పెదరు?

ప్రత్యు॥ స్మృతులు పురాణములు మున్నగునవన్ని యును భగవద్వాక్యములేయని నేనునమ్మను. వాటిలో అనేక శ్లోకములు క్రొత్తగా చేర్పబడెను. కావున సత్యము అహింసనీతి మున్నగువాటికిని అధిక సంఖ్యా కులచే నామోదింపబడిన సత్యములకును విరుద్ధమైన శ్లోకములు శాస్త్రములలోనుండినను వాటిని నమ్మగూడ దని నేనిదివరకే చాల సారులు వ్రాసియున్నాను.

ప్రశ్న॥ నాలుగు వర్ణములవారును సమానములేయను మీ అభిప్రాయమునందు నాకు నమ్మకముకలదు గాని శాస్త్ర ములలో చెప్పబడిన విషయము లిందులకు విరుద్ధముగా నుండలేదా? ఈ విషయమునుగూర్చి స్మృతులను చూడుడు.

ప్రత్యు॥ అయిదవ ప్రశ్నకుగూడ పై విషయమే ప్రత్యుత్తరమగును. అగ్రవర్ణము అంత్యవర్ణము అను విభేదము నీతిశాస్త్ర ప్రధాన సిద్ధాంతమునకు విరుద్ధము. భగవంతుని సృష్టిలోని సమస్త జీవరాసిలోను నేను శ్రేష్ఠతముడను అని ఒక బ్రాహ్మణుడు తలచినవెంటనే అతని బ్రాహ్మణత్వము తొలగును. బ్రహ్మజ్ఞాని అటుల నెన్నడును తలపడు. మనమందరమును భగవంతుని బిడ్డలమే అగునెడల మనలో హెచ్చు తక్కువ లెటులకలుగు? వేదములలో పురుష సూక్తములో గలుగు వర్ణములనుగూర్చి తెలుపుటలో శరీరమునందలి నాలుగు ముఖ్యావయవములగు ముఖము, చేతులు, తొడలు, పాదములు, వీటితో నాలుగు వర్ణములును పోల్చబడెను. చేతులు తొడలు కాళ్లు వీటికంటె తల గొప్పదనిగాని లేక ముఖము చేతులు తొడలు వీటి కంటె కాళ్లు గొప్పవనిగాని చెప్పదగునా? ఈరీతిగా నేనుగొప్ప నేనుగొప్ప అని మన శరీరములోని అవయవములు కలహింపసాగినచో నేమగును? కావున ప్రపంచములో అన్ని జీవులలోను వర్ణవ్యవస్థ సమానమే. దానిలో హెచ్చు తక్కువ లెంతమాత్రమునులేవు. ప్రపంచమున అన్నిమతములును ఈ సత్యముపైననే ఆధారపడినవి. శూద్రులనుగూర్చి స్మృతులలోని శ్లోకముల భావము మానవ స్వభావమునకు విరుద్ధము గాన

వాటిని తిరస్కరింపపడెను.

ప్రశ్న॥ వర్ణము జన్మవలననే కలుగును. బ్రాహ్మణ కులమున పుట్టినవాడు స్వధర్మమును నెరవేర్పక పోయినచో భ్రష్టుడగునని మీరు తెలిపిరి. అపుడతడు యే వర్ణమునకు చేరును. బ్రాహ్మణధర్మమును నెరవేర్చు శూద్రుడే వర్ణమునకు చేరును?

ప్రత్యు॥ బ్రాహ్మణుడైనను శూద్రుడైనను స్వధర్మమును వదలినచో పతితుడగును. అపుడు వాడేవర్ణమునకు చేరడు. వారు మరల స్వధర్మమును నెరవేర్ప నారంభించినచో మరల స్వవర్ణమును బడయగలుగుదురు.

ప్రశ్న॥ ఒకడు తినునట్టి ఆహారమును బట్టి వాని సద సద్వర్తనమును విడగానె దుర్వర్తనుడుగా నుండువాడు తాకిన అన్నమును తినుటవలనను నీళ్లు త్రాగుటవలనను అప విత్రత కలుగును. అవి తెలుపబడెను. ఒక వర్ణమువారితో కలిసి భుజింపగూడదను నియమము వర్ణవ్యవస్థలో ముఖ్య విషయముకాదని మీరు తెలిపితిరి ఇది నిజమేనా?

ప్రత్యు॥ మానవులలో కొందరు పతితులనియు వారు అస్పృశ్యులనియునెప్పుడునుగూడభావింపగూడదు. అది దురహంకారమగును. ఒకనికి చెడుతలపులు కలిగి నను నోటివెంట చెడు వాక్యములు వెడలినను చేతుల వలన దుష్కార్యములు జరిగినను అతడు పతితుడగును గాని పరిశుభ్రతగల యితర వర్ణములవారిచ్చు ఆహారమును తినుటవలనను నీళ్లను త్రాగుటవలనను

ఎవరును పతితులుకారు. కాని సాత్వీక స్వభావమును కలుగజేయునట్టి పదార్థములనే అందరును తినవలెను.

ప్రశ్న॥ హరిజన సేవకులు అస్పృశ్యతా నిర్మూలనమును గూర్చి పనిచేయుటకు వెళ్ళినపుడు సనాతనులు మిమ్ములను చాల నిందింతురు. వారి ఆక్షేపణలకు మేము సమాధానము చెప్పుచుందుము. మీ ఆశ్రమములో మరణావస్థలోనున్న ఒక ఆవుదూడను మీరు చంపితిరనివారందురు దీని విషయమేమి?

ప్రత్యు॥ సనాతనులు నన్ను నిందించినచో హరిజన సేవకులు ఆగ్రహము చెందకూడదు. నేను చేసిన పనులను సమర్థించుచు నాపక్షమున వాదింపకూడదు. నిందవలన ఎవరికిని యెట్టినష్టమును కలిగియుండలేదు. ఒకడు దుష్కార్యములను చేసినచో నితరులకు బాధ కలుగును. హరిజన సేవకులు అస్పృశ్యతా నిర్మూలనమునుగూర్చి కష్టపడి పనిచేయవలెను. దానిని సమర్థింపవలెను నా ఆశ్రమములో ఆవుదూడ మిక్కిలి బాధపడుచుండెను. ఆ బాధను తొలగించుట కవకాశము లేదని డాక్టరులు తెలిపిరి. ఆ బాధను నేను చూడజాలక దానికివెంటనే బాధ నివారణయగుటకు దానిని చంపితిని. ఇది పాపమని నేను తలపనుగాన దానికొరకు నేను పశ్చాత్తాపమును చెందను. దీని వివరములను తెలియగోరువారు ఆ కాలమున వెలువడిన ఎంగు ఇండియా నవజీవను పత్రికలను చదువవలెను. అంతకంటె దీనిని గూర్చి 8వ ప్రశ్నకు నేనిచట వ్రాయ నవసరములేదు.

## అహింసా సిద్ధాంతమునందలి సూక్ష్మధర్మము

"మనుష్యుల శరీరములో దేవతలకును. దానవులకును, చీకటికిని వెలుగునకును, సత్యా సత్యములకును, భగవంతునకును, సైతానుకును నిరంతరము పోరు జరుగుచున్నది. మన సర్వశక్తులను వినియోగించి మనమీ పోరాటమును కొనసాగింపవలెనుగాని మనము అల్పశక్తులమను విషయమును మరువరాదు. అర్జునుడీవిషయమును మరువకున్న సమయమునందే శ్రీకృష్ణ ప్రభువు అతనికి భగవద్గీతలను బోధించి అతనిని సరియైన మార్గమునకు గొనివచ్చెను.

అహింసా పరమోధర్మః "అను విధి నందరును గూడ నెరవేర్చవలయుననుట నిశ్చయమేగాని, పాములనిన నాకు చాల భయముగానున్నపుడు నేనేమిచేయవలెను?" అహింసాసిద్ధాంతమును భంగపరచగూడదని నేను పామును చేతితో చంపకపోయినను మనసుతో నదివరకే చంపితిని. అట్టిస్థితిలో దానిని చంపుటయే కర్తవ్యము అటులనే బ్రహ్మచర్య వ్రతమును నెరవేర్పజాలనివాడు గృహస్థధర్మము నవలంబించవలెను. భీష్మునివలె యావజ్జీవమును బ్రహ్మచారులుగా నుండుటయే ఉత్తమ పద్ధతిగాని అది అందరికిని సాధ్యము కాదు. జితేంద్రియులు కాజాలనివారు స్త్రీ సాంగత్యమును కోరెడివారును మానసిక వ్యభిచారమును

చేయుచునే యుందురుగాన వారు ఒకస్త్రీని వివాహము చేసికొనుటయే మంచిపని. లేనిచో వారు లోకమును తమ్ము మనుగూడ వంచించినవారగుదురు. కొంతకాలము ప్రయత్నించిన పిమ్మట అహింసయును బ్రహ్మచర్యమునుగూడ వానియంతట నవియే సాధ్యమగును.

అ ను భ వ ము గా ని

తర్కవాదముగాదు.

నేనుచేయు ప్రతిపనికిని యావజ్జీవమును సత్యమెటుల ఆధారమో అహింసగూడ అటులనే ఆధారమై యున్నది. మానవసంఘమునకు చేరిన యీ కుటుంబముతో నాకు గల సంబంధమును బట్టి నేను చేయవలసిన పనులలో తరుచుగా నేను అహింసా సత్యముల కనుగుణముగా పనిచేయలేకుండ పోవుటకు నాహృదయ దౌర్బల్యమే కారణము గాని అవిశ్వాసముగాదు. అహింసా సత్యములయందు నాకు పూర్ణవిశ్వాసము గలదు. ఈసత్యమును నిరంతరము అనుసరింపవలెనని కోరుచుందునుగాని దౌర్బల్యమువలన విఫలుడ నగుచుందును. మరల ప్రయత్నించుచుందును. నా ప్రయత్నము విఫలమైనపుడెల్ల నా దీక్షయును విశ్వాసమును మరింత అధికమగుచుండును. సత్యమును అహింసను నిరంతరమును ఎల్లవారు సరిగా నెరవేర్చుచుండునెడల కలుగగల ఫల మత్యధికమని ఆస్తిక దృష్టిలో నేను

చూడగలనుగాని ఆ మహాత్మృత్వమును సరిగా తెలుసు కొనజాలము

సత్యమునుఅహింసను మనముపూర్తిగా ననుసరింప గలుగునెడల అస్పృశ్యతా నిర్మూలనమునకు జరుగు చున్నకృషి యింకను చాల పవిత్రముగా నుండగలదు. అమెరికా దేశీయుడగు నొకమిత్రుడు అహింసా సత్య ముల ననుసరించుటకు చాలకాలమునుండి గట్టి ప్రయ త్నము చేయుచుండినను పూర్తిగాసఫలుడు కాలేదు. గాని అతడు వీటియందు తనకుగల విశ్వాసమును తన మనస్థితిని వెల్లడించుచు నాకు అత్యంత స్నేహ భావ ముతో వ్రాసిన లేఖలోని విషయములను హరిజన సేవకులందరునుగూడ తెలుసుకొనగలుగుటకు వాటినీ దిగువను వివరించుచున్నాను.

"వెనుక నాకును, మీకును జరిగినసంభాషణను బట్టి అహింసా సిద్ధాంతమునందు నాకుగల నమ్మకము తగ్గిపోవుచున్నట్లు మీరు తెలుసుకొని యుందురు. దీనిని గూర్చి నాకుకొన్ని సంశయములుండుటవలననే నేను మీతో హెచ్చుగా సంభాషింపగోరితిని అది వివేకమే యగును. ఏలననగా మహత్తమములగు నైతిక, ఆముష్మిక సత్యములను, తర్కవాదములవలన స్థిర పరుచుట యెన్నటికిని సాధ్యముగాదు. అనుభవము వలననే వాటిని పరీక్షింపవలెను. నా జీవితములో నేనట్టి

పరీక్ష నధికముగా జేసియుండలేదు. అహింస నిత్యసత్యమని నా అనుభవమువలన ధ్రువపరుచుటకు నేనింకను కఠిన నియమముల ననుసరింపవలెనని తోచుచున్నది.

అహింసా సత్యముల ననుసరించుచున్న యితరుల జీవితములలో కలిగిన ఫలితములను నేను కనిపెట్టి యుండుటచే నా విశ్వాసమునకిది మూలాధారములలో నొకటియని నే నంగీకరింపగలిగితిని. బాబు రాజేంద్ర ప్రసాదుగారు మున్నగువారికి నేను అంతరంగిక సహచరుడనుగా నుండగల భాగ్యమును నాకు కలుగజేసినందులకు నేను భగవంతునికి మిక్కిలి కృతజ్ఞుడను. రాజేంద్ర ప్రసాదుగారు మున్నగువారు చాలమంది అహింసా సత్యములకు అనుగుణమగురీతినే అన్ని పనులను చేయుచుండుటవలన దురాశ కామక్రోధములు, స్వార్థపరత్వము, రాగద్వేషముల, భయము మున్నగు వాటిని పూర్తిగా జయింపగలిగిరనియు అందువలన వారు పునీతులైరనియు నేను తెలుసుకొంటిని కొందరు అహింసా సత్యముల అలౌకిక దివ్యప్రకాశమును లేశమాత్రముగా కనుగొనగలిగినను కామ క్రోధ లోభ మోహ మాత్సర్యములనబడు అంతశ్శత్రువులు ఆ దివ్యధామ ద్వారముకడ వీరిని నిరోధించుటచే వీరు శత్రులను జయింపజాలకపోయిరి. అట్టి మనుష్యులు భయమునకు పూర్తిగా లొంగిపోయెదరు. అహింసా సత్యము

లను పాటించుచున్న మిమ్ముల ననుసరించుచున్న కొద్దిమంది నాయకులలో కలిగిన మంచి మార్పునే నేను ముఖ్యముగా గమనించుచుంటిని. గాని మీరు ప్రతి కూలురుగానుండి మిమ్ములను ప్రతిఘటించుచున్న వారిలో అహింస యెట్టి ఫలితమును కలుగజేసిన దను విషయమును నేను గమనించుటలేదు. మిమ్ముల ననుస రించుచున్న అల్ప సంఖ్యాకులుగూడ అహింసా నిరతు లైరి. ఈ విశ్వము నీతిపై ఆధారపడినదని నేను నమ్మె దను గాన అసత్యనిరతులగువారి కెట్టి సద్వర్తనము లభించదని నేను నమ్ముచున్నాను. సత్యనిరతులు సద్వ ర్తనములైనపుడు అసత్యనిరతులు దుర్వర్తనులగుట రాత్రితరువాత పగలువచ్చునట్లు సహజఫలితమేయగును కావున "ఖడ్గధారి చివరకు ఖడ్గమువలననే మృతినొం దును" అని యేసుక్రీస్తు తెలిపిన విషయముగూడ ధ్రువపడినదని నేనీ వాదసరణివలననే నమ్ముచున్నాను.

మీ ప్రయత్నము చివరకు ఫలప్రదమగుటనిశ్చ యమేగాని అందులకు అత్యధికమగు సహనశక్తిని బూనవలసియుండును.

భారతదేశమునకు మీరిపుడు ప్రధాననాయకు లుగా నుంటిరిగాని మీ నాయకత్వ లక్షణములు మీకు పుట్టుకతోనే యేర్పడలేదు. తరువాతనైన నవి ఒక రోజులో మీకు గలుగలేదు. మీరు సత్యమును సంద

ర్శించి పిమ్మట పెక్కు సంవత్సరములపాటు వోరిమితోను త్యాగముతోను దాని నారాధించి చాల కష్టములతో గూడిన అతి దీర్ఘమగు నా యనుభవమువలననే చివరకు నాయకపదవిని బడయగలిగితిని. మానవ స్వభావము యిండియాలో నొకరీతిగాను యూరపులో మరియొకరీతిగాను యుండదు. గాన దీక్షతో నలవరుచుకొనునెడల ఐరోపాఖండమువారుగూడ అహింసా నిరతులు కాగలరు. వారికిపుడు అట్టి అభ్యాసములేదు. అభ్యాసమువలన తప్ప మరి దేనివలనను అహింసానిరతి పాశ్చాత్యులకు గలుగదు. ఈ అభ్యాసములో చాల సారులు ఆశాభంగము కలుగుచుండును. చాలమంది విఫలులగుచుందురు. చాలమంది వదలివేయుచుందురు గాని అహింస నిత్యసత్యమగుటచే దానినెన్నడును వదలివేయగూడదు. "అని యీ మిత్రుడు వ్రాసెను"

---

## స్త్రీ ధర్మం గృహిణిగానుండుటే.

ఒక స్త్రీ ఆయనకు ఉత్తరము వ్రాయుచు స్త్రీలోనున్న పిచ్చగుణాలను పోగొట్టేమార్గ మేదో బోధించవలెనని కోరగా ప్రత్యుత్తరంగా గాంధిమహాత్ముడీ వ్యాసం వ్రాసెను.

గాంధిమహాత్ముని అభిప్రాయంలో స్త్రీపురుషులు ఒకటే. వారి సమస్యయు ఒకటే. ఇద్దరిలో నున్న ఆత్మ

ఒకటే. ఉభయుల జీవితమొకటే. మనోభావాలు ఒకటే. ఒకరినొకరు మఱియొకరి సహాయంలేకుండా ఉండలేరు.

పురుషుడు స్త్రీపై అధికారం చలాయించుచున్నాడు. స్త్రీ పురుషునికన్న తక్కువ అని నమ్మేటట్లు నేర్పబడ్డది. మన ఋషులుమాత్రం స్త్రీకి ఉన్నతస్థానమిచ్చిరి. అయినా ఉభయులు ప్రధానంగా ఒకటైనప్పటికి యిద్దరికి ముఖ్యమైన భేదం ఉన్నది.

అందుచేత వారు అనుసరించే వృత్తులలోకూడా భేదమున్నది. సంతతిని గాపాడుటకు శిశువులను పెంచుట ఆమె ప్రత్యేక ధర్మము. ఆమె ఆ విషయములో జాగ్రత్త దీసుకోకపోయిన ఆజాతి సంతతి అంతరించవలసినదే.

అటువంటి స్త్రీ యింటిని వదలి ఆ యింటిని రక్షించుటకై ఆయుధములు చేపట్టినయెడల పురుషునకును స్త్రీకిన్ని న్యాయసమే. అంత అనాగరక కార్యమింకొకటుండదు. దాంతో మొదటికి మోసపుచున్నాము. పురుషుడు యొక్క గృత్తమును స్త్రీ యొక్క ప్రయత్నించుటలో స్త్రీయు పురుషుడునుకూడ పతితులగుచున్నారు. స్త్రీని ఆమె ప్రత్యేకవృత్తిని వదలి రమ్మనుటలో పురుషుడు పాపము చేయుచున్నాడు. బైటినుండి దాడి రాకుండ యింటిని రక్షించుకొనుట యెంతధైర్యము కావలెనో యింటిని చక్కనిపరిస్థితిలోనుంచుటకును అంతటి

ధైర్యముకావలెను. స్త్రీ పురుషుల కార్యరంగములు వేరని అంగీకరించినయెడల అందుకు గావలసిన గుణ ములు విజ్ఞానము ఉభయులకును ఒకటేయనిమాత్రము తెలియగలదు. స్త్రీ అహింసావతారము అహింస అనగా ప్రేమమయి, త్యాగసమర్ధ స్త్రీ మాతృదేవతగాక మరె వరు యీ శక్తిని ప్రదర్శింపగలరా? నవమాసములు మోసి, గర్భములో బిడ్డను తన రక్తముతో పెంచి తుదకు ప్రసవవేదనలోబడు కష్టమును మించిన దింకొ కటి కలదా? కాని పుత్రోదయము కాగా ఆ కష్టముల నన్నింటిని ఆమె మరచిపోవును.

ఇకను ఆమె కన్న శిశువు దినదినప్రవర్ధమానము కావలెనని కష్టపడేదెవరు. ఆమెకన్న ప్రేమ మానవాళి కంతటును గలుగవలెను. ఆమె పురుషుని కామాంధ కారమున కొక ప్రతిమనన్న విషయమును మరచిపోవ లెను. అప్పుడు ఆమె పురుషునితోబాటు ఆయన తల్లిగా సృజనదేవతగా మౌనము ద్రవహించిన నాయకమణిగా నుండగలదు. ఆమెయే యుద్ధమునబడి శాంత్యమృత మెక్కడ దొరకునాయని కొట్టుకొనుచున్న ప్రపంచము నకు శాంతిమార్గము నుపదేసింపగలదు ఆమె సత్యా గ్రహ నాయకత్వము వహింపగలదు అందు పుస్తక జ్ఞాన మక్కరలేదు. త్యాగము విశ్వాసమువల్ల నేర్పడు మనోధైర్యము గావలెను.

నేను పూనాలో సాసాను ఆసుపత్రిలో కొన్ని సంవత్సరాలక్రింద జబ్బుగా ఉండగా నన్ను గాచినతల్లి ఆదాది. నాకు ఒక కథ చెప్పినది. ఒక స్త్రీకడుపులో ఉన్న పిల్లపోతుందని మత్తుమందు పుచ్చుకోనన్నదట, చాలా కష్టపడి శస్త్ర చికిత్సకు పాలైనది. శిశువునందు ప్రేమ ఒక్కటే ఆమెకు బాధలేకుండచేసెను. ఆ శిశువును దక్కించుకొనుటకు ఆమెపడేకష్టం కష్టమనిపించ లేదు. స్త్రీలలో నెందరో అటువంటి ధీరమణులుగలరు. అయ్యో పురుషజన్మ యెత్తలేదేయని వారు తమ స్త్రీ జన్మను నిందించుకోరాదు. ఆ ధీరమణిమాట జ్ఞాపకము వచ్చినపుడు స్త్రీ భాగ్యమెంతటిదా అని నాకనిపించును. అయితే ఆ విషయమును స్త్రీ తెలుసుకొనవలెను. స్త్రీ పురుషజన్మ యెత్తలేదను కొన్నట్లే పురుషుడును స్త్రీ జన్మ యెత్తకపోతినే అని అనుకోవలసినదే. కాని యిది వృథాకోరిక. మన మేజన్మయెత్తినను ప్రకృతి ధర్మమును నెరవేర్చుచు సార్థకము జేసుకొనెదముగాక!

---

రాజకీయ రంగంలో అహింస
సర్వజీవులయెడ భూతదయ
రెండింటి తారతమ్యం.

కాంగ్రెసు నాయకులకు నా అహింసానిర్వచనం చెప్పినందువల్ల నేను అహింసయొక్క వ్యాప్తిని పరి

మితం చేసేశాననిఆక్షేపిస్తూ వచ్చిన ఉత్తరాలకు యీలా జవాబిచ్చాను.

"నేను చెప్పినమాటలు కాంగ్రెసు అహింసకు మాత్రమే సంబంధించినవి అన్న సంగతిని ఈమిత్రులు మరచిపోతున్నారు. వ్యక్తిగతంగా అయితేనేనేమో పురుగులనూ తేళ్లనూ పాములనైనా చంపను. ఏ సందర్భంలోనూ నేను మాంసమూతినను. కాని, కాంగ్రెసు వారిచేత నేను ఇట్టి అహింసావ్రతాన్ని బలవంతంగా ఆచరింప చెయ్యకూడదు. కాంగ్రెసు మతధర్మ సంస్థ కాదు. కాంగ్రెసు రాజకీయ సంస్థయే కాంగ్రెసు సంస్థ లోని అహింస మానవ వ్యవస్థకు పరిమితియైనది.

"ఈ అహింసను ఇంకా పరివ్యాప్తంచేస్తే, విస్తరిస్తే, హిందువులు మాత్రమే, అందులోనూ మరీ వైష్ణవులూ, జైనులూ మాత్రమే మిగులుతారు. కాంగ్రెసులో పాల్గొనడానికి, లక్షలకొలదీ హిందువులు చేపలూ, మాంసమూ తినేవాళ్లు ఉన్నారు. వారుకూడా కాంగ్రెసులో పాల్గొనడానికి వీలులేకుండా పోతుంది. కాంగ్రెసు అహింసాచరణ గూర్చిన నా ఉద్దేశం నా మనస్సుకు చాలా సరళంగాను సూటిగాను ఉన్నది. దీనికి ఎవ్వరూ ఆక్షేపణ చెప్పరనే నేను అనుకున్నాను.

"అంతేకాక, కాంగ్రెసుయొక్క పరిమితమైన అహింసనైనా వ్రతంగా ఆమోదించని మహాత్మ

దీయులు అనేకులు ఉన్నారనే సంగతిని. నన్ను ఆక్షేపించేవాళ్లు, తెలుసుకోవలసియున్నది. అసలు కాంగ్రెసు వారే వర్ధా తీర్మానంవలనూ పూనా తీర్మానంవల్లనూ, అహింస వ్యాప్తిని అత్యంతం సంకుచితంచేసి ఇంచుమించు అహింస అంటే అర్థంలేదన్నట్లు చేసేశారు. ఈ సంగతిని నా విమర్శకులు తెలుసుకోవాలి.

“అందువల్ల తేలేదేమంటే, ఈ కాంగ్రెసు యొక్క అహింసా వ్యాప్తిని ఇంకా ఏమాత్రం విస్తరించడానికి ప్రయత్నించినా, మానవేతరమైన జీవ ప్రపంచానికి కూడా అహింస వర్తించేటట్లు చెయ్యడానికి ప్రయత్నంచేస్తే, దీని ఆశయానికే భంగం వస్తుంది. అపరిమితమైన అహింస విశ్వవ్యాప్తం కావడానికి చాలాకాలంపడుతుంది.

దౌర్జన్యమూ హింసాపద్ధతీ (అవిచికధర్మాలు) విదులు సంఘంలో ప్రేమధర్మం ప్రవేశపెట్టగలిగి అలవడజేయగలిగితే మనం ధన్యులమౌతాము.

మనం శత్రువులుగా భావించే వ్యక్తులయెడల మన హృదయాలలో ఈర్ష్యాసూయా వైరమూ కలుగజేసుకోవడంకంటే వారిని నిజమైన మిత్రులుగానూ ముందుకు స్నేహితులు కావలసినవారిగానూ భావించి ప్రేమించడం నేర్చుకోగలిగి అలవరుచుకోగలిగితే మరీ ధన్యులం అని మనం తెలుసుకుంటే చాలును.

"అంతేకాక ఉత్త జీవదయ (భూతదయ) వల్లనే మనం అరిషడ్వర్గాన్ని కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను గెలుచుకోవడమూ, వాటికి అతీతులమవడమూ జరుగజాలదనికూడా, మనం బాగా జ్ఞాపకం ఉంచుకోవాలి.

పూర్తిగా ఆత్మను స్వాధీనం చేసుకున్నవాడూ, స్వార్ధరహితూ. ఆత్మ సంయమమూ నిగ్రహమూ గల వాడూ. సర్వ మానవునియెడలా సద్భావమూ ప్రేమా పరిపూర్ణంగా కలవాడు, తన అన్ని కార్య కలాపాల లోను ప్రేమ ధర్మంవల్లనే పరిపాలితుడైనవాడూ, ఉంటే చూపించండి. అట్టివాడు మాంసాహారియైనా. అతనికి నా భక్తిపూర్వకమైన ప్రణామాలతో నేను జోహారు చేస్తాను.

జీవదయ (భూతదయ) వ్రతం గాగలవాడొకడు ఉన్నాడనుకొండి. అయితే అతడు కామ క్రోధ పూరితు డనుకొండి. అయినా రోజూవ్రతంగా చీమలకూ పురుగు లకూ ఆహారం పెడుతూ ఏ జీవజంతువునూ చంపడను కోండి (ప్రాణనష్టంచెయ్యడు.) ఇట్టిది ఏమీ గొప్ప సంగతికాదు. ప్రత్యేక ప్రశంసకు అర్హంకాదు. ఎట్టి ఆధ్యాత్మిక విలువా ప్రయోజనమూలేని శుష్క కార్యా చరణయే అవుతుంది ఇది. అంతకంటే అధ్వాన్నం కూడా కావచ్చును- లోపలి అవినీతినీ అపవిత్రతనూ

డాచిపుచ్చుడానికి ఇట్టి భూతదయ ఆచరణ మోసమైన తెరవంటిది కూడా కాగలదు."

---

## ఒక క్రైస్తవమిషనరీ మహాత్మునితో సంభాషించుట.

## ప్రశ్నోత్తరములు

ప్రశ్న॥ మీకెప్పుడును కోపము రానేరాదని నేను వింటిని. ఇది నిజమేనా?

ప్రత్యు॥ నాకుగూడ కోపమువచ్చునుగాని నేను దాని నడచివేసెదను. కోపమును జయించుటకును నోరిమిని బూనుటకును నేను నిరంతరమును ప్రయత్నించుచుందును. చాలావరకు నాకు విజయము కలిగినది. కోపము వచ్చినపుడుమాత్రమే నేను దాని నడచివేసెదను. అటుల అణచివేయుటకు ప్రతి వ్యక్తియును నిరంతరమును ప్రయత్నించుచు దానిని సాధించవలెను.

ప్రశ్న॥ బీదలపై మీకింతటి అధికమగు ప్రేమ యెపుడు మొదట కలిగినది?

ప్రత్యు॥ నాకది చిన్నప్పటినుండియు చాలా హెచ్చుగానేయున్నది. అది నా స్వభావములోనే యున్నదనుటకు నేనెన్నియో నిదర్శనములను చూపగలను. బీదలకంటె నేనధికుడనని నేనెన్నడును అనుకొనలేదు. వారు నా ఆప్తబంధువులనియే తలచెదను.

ప్రశ్న॥ మురికిగానున్నవారిని చూచినచో మీ కసహ్యము గలుగదా?

ప్రత్యు॥ వారిని చూచిన నా కసహ్యము కలుగదు గాని మురికిగానున్న వస్తువులను చూచిన అసహ్యము కలుగును. మురికిగానున్న గిన్నెలు గరిటెలు బట్టలు మున్నగువాటిని నేనుపయోగింపనుగాని మురికినిగూడ నుపయోగ కరముగా చేయుటకు నేను ప్రయత్నించెదను.

ప్రశ్న॥ బీదవారు బిచ్చమెత్తుటకు మీ రంగీకరింతురా?

ప్రత్యు॥ బిచ్చగాండ్రసంఖ్య హెచ్చుట నా కిష్టము లేదు కాని నావద్దకు బిచ్చగాడు వచ్చినచో వానికి అన్నముపెట్టెదను. నేను వారికి పనిచెప్పి వారు బిచ్చమెత్తకుండ చేసెదను. వారు పనిచేయనిచో వానికి అన్నముపెట్టను. గ్రుడ్డివారు కుంటివారు మున్నగు వికలాంగులను దొరతనమువారు పోషింపవలెనుగాని బిచ్చగాండ్రు చాలమంది గ్రుడ్డి కుంటి మున్నగునవి లేకపోయినను అవి యున్నట్లు నటించి మోసగించుచున్నారు. గుడ్డివారు కొందరు అన్యాయమునకు గడంగి చాలా ధనము సంపాదించుచున్నారు. అట్టివారి నిట్టి దురాకర్షణమునుండి తప్పించుటకు వానిని శరణాలయములలో నుంచవలెను.

ప్రశ్న! క్రైస్తవ మిషనరీలు భారతీయులను తమ మతములో కలుపుకొను నిమిత్తము ఇండియాకు రాకుండ మీరు నిరోధించెదరా?

ప్రత్యు॥ నేను వారినెటుల నిరోధింపగలను. ఒక మతమువారిని ఇంకొక మతములో నికి చేర్చుటకు నేనెంతమాత్రమును అంగీకరింపను. అటుల చట్టము చేయబడవలెనని నేను కోరెదను. దీనివలననే వివాదములును మిషనరీలలో వానస్తాపములును చాలా హెచ్చుగా కలుగుచున్నవి. మత ప్రచారము నిమిత్తముగా ప్రజలకు సేవజేయుటకు విదేశములవా రెందరిచటికి వచ్చినను నేను సంతసించెదను. హిందువుల యిండ్లలోనికి క్రైస్తవమిషనరీ వచ్చినప్పటినుండియు కుటుంబశాంతికి భంగము కలుగుచునేయుండును. దుస్తులు, భాషయు, ఆహారము, పానీయము పద్ధతులు యివి యన్నియును గూడ మారిపోవును.

ప్రశ్న॥ ఇదిఅంతయును వెనుకటిమాట ఇప్పుడిట్టి మార్పులులేవు.

ప్రత్యు॥ పైకి మార్పులు లేకపోయినను లోపలిస్థితి వెనుకటివలెనే యున్నది. ఇప్పటికిని హిందూమతమును వారు దూషించుచునే యున్నారు. మిషనరీల గ్రంధ విక్రయశాలలో ఇప్పుడుగూడ మరడకు వ్రాసిన పుస్తకముల నమ్ముచునేయున్నారు. వారి దుక్రృథము మారలేదనుటకిది ముఖ్య నిదర్శనము. వారి గ్రంథము

లను బహిష్కరింపవలెను. హిందూమత దూషణము తప్ప ఆ గ్రంథములలో మరేమియులేదు. ఈ మధ్యనే ఒక మిషనరీ కరువు పుట్టిన ఒక తావునకువచ్చి నిరుపేదలకు ధనమిచ్చి వారిని తన మతములో కలుపుకొనెను. వారి దేవాలయమును పడగొట్టించెను. ఇది దారుణముగాదా? ఆ దేవాలయము తన మతములో చేరినవారి సొంతసొత్తుగాదు. అది మిషనరీ సొత్తుగాదు కాని అతడు వారిచేతనే దానిని పడగొట్టించెను.

ప్రశ్న॥ మా వైద్యశాలకు వచ్చినవారిని మా మతములో కలుపుటకు మేమెట్టిప్రయత్నము చేయము. రోగములను కుదుర్చుకొనుటకు మనవద్దకువచ్చిన వారికి మనము తమ సంగతి చెప్పకూడదని మా డాక్టరు తెలుపుచుండెను. ఇతర మతములవారు మతంపద్ధతి నవలంబించునట్లు బోధింపవలెనని బైబిలులో నుండలేదా? మీరేల ఆక్షేపించెదరు?

ప్రత్యు॥ వారిని మీ మతములో చేర్చుట దాని యుద్దేశ్యముకాదు. ఆ వాక్యములకు మీరిటుల వ్యాఖ్యానము చేసినచో క్రైస్తవులుగానివారినందరిని మీరు నిరసించినవారగుదురు. ఏసుక్రీస్తు మరల నిపుడు అవతరించునెడల తన మతముపేరట జరుగుచున్న చాలా అక్రమముల నతడునిరసింపకమానడు./ప్రభువు సంకల్పమును నెరవేర్చినవాడే క్రైస్తవుడుగాని ప్రభువా, ప్రభువా, అని అనుచువారందరును క్రైస్తవులుగారు క్రీస్తు

పేరు వినని వాడు అతని సంకల్పమునే నెరవేర్ప గోరడా?

---

## మహాత్ముని ఉపాసనాపద్ధతి.

ఈశ్వరోపాసన పద్ధతినిగూర్చి ఒక క్రైస్తవ మిషనరీ మిత్రుడడిగిన ప్రశ్నలకు మహాత్ముడు ఈ క్రింది విధంగా సమాధానమిచ్చాడు.

ప్రశ్న.- ఈశ్వరోపాసన మీరేవిధంగా చేస్తారు?

ప్రత్యు:- ప్రతిరోజు ఉదయం 4-20 గంటలకు, సాయంత్రం 7 గంటలకు నేను, ఏకాంతంగా గాకుండా పదిమంది మిత్రులతో కలిసి కూర్చుండి, ఉపాసన జరుపుతూ యుంటాను. ఏళ్లతరబడిగా నడుస్తూయున్న దీపద్ధతి. భగవద్గీతలోనుంచి ఇంకా సర్వ సమ్మతమైన ఇతరమత గ్రంథాల్లోనుంచి కొన్ని భాగములు చదవడ మూ, భక్తులు రచించిన కీర్తన లేవైన పాడడమూ సాధారణంగా జరుగుతుంది. ఇది వాక్కులతో వర్ణింప నలవికాని ఉపాసన. ప్రపంచములో నుంచి ఏ అంశము ఎవని దృష్టినుంచి తప్పించుకోలేకపోలేదో అట్టి సర్వసాక్షి యొక్క సాన్నిధ్యాన్ని అనుభవించని క్షణమంటూ నాకులేదు. నా అంతఃకరణను ఆ సర్వ సాక్షికి విధేయతగా తలచుకోవడమే నిత్యమూ నా ప్రయ త్నము క్రైస్తవమిత్రులుచేసే మాదిరిగా వాగ్రూప

యితడు చాలా మంచి మార్పులు చేశాడు. ఇతడు బౌద్ధమత గ్రంధాలను చదివాడు. అందువల్ల యితని ప్రవృత్తిలో అత్యధికమైన మార్పు కలిగింది. ఇతడు హాంగరీ దేశీయుడు. ఇతడు యిదివరకుకూడా మహాత్మునితో ఉత్తర ప్రత్యుత్తరాలను జరుపుతూ వుండేవాడు. పూనా పడంబడికనిమిత్తం మహాత్ముడు నిరసన దీక్షను పూనినపుడు సానుభూతిని తెలుపడానికి డాక్టరు భక్తిగారు కూడా నిరశన దీక్షను పూనాడు. మహాత్మునితో మాట్లాడడానికి యితడు ప్రత్యేకంగా అబోటాబాదు వచ్చాడు. శ్రీకృష్ణదేవుడు అర్జునునకు బోధించిన భగవద్గీతమీదా, ధమ్మపదమనే బౌద్ధ గ్రంధముమీదా యితనికి యెక్కువ సమ్మకం వుంది. యీ రెండుగ్రంధాలు యెల్లప్పుడు యితనిదగ్గరనే వుంటాయి.

డాక్టరు:- మీరు చేసే ప్రార్ధన యేలాటిది? ప్రార్ధనవల్ల భగవంతుని మనస్సు మారుతుందా? దానిని మనం ప్రార్ధనవల్ల తెలుసుకోగలమా?

మహాత్ముడు:- భగవంతుని మనస్సు మారదు. భగవంతుడు జడచేతనాత్మకమైన సమస్త ప్రపంచంలోను పూర్తిగా వ్యాపించియున్నాడు, మనంప్రార్ధన చెయ్యడంవల్ల మనలోవుండే దైవ తత్వానికి ప్రబోధం కలుగుతుంది. ఇది కేవలం హృదయంలో కలిగే అనుభవం మాత్రమే. మనం భగవంతుని స్వయంగా

చూడలేము. స్వరాజ్యంకోసం గాని, మరివకదానికోసం గాని ప్రార్థనచెయ్యడమంటే వాటిని బడయడానికిన్నీ వాటిని సంపాదించడానికి యెక్కువ కృషిసలుపడానికిన్నీ తగిన శక్తిని పొందగోరడమే. భగవత్ప్రార్థనవల్ల అటువంటి శక్తి మనకు కలుగుతుంది.

డా:- ప్రార్థనఅంటే వక కోరికను కోరడమె. దానికోసం యాచించడం. లేదా హక్కును ప్రకటించడం.

మ:- అవును. స్వరాజ్యంకోసం నేను నా అంతరాత్మను లేక ఉత్తమాత్మను యాచించినాను. అదే నిజమైన ఆత్మ. దానితో నాకింకా సంపూర్ణమైన తాదాత్మ్యం కలగలేదు. విశ్వమందంతట వ్యాపించి వున్న పరమాత్మలో లీనమై పోవాలని నిరంతరమును అపేక్షిస్తూ వుండడమే ప్రార్థన.

డా:- దీనికోసం మీ రొక పాతవణపాన్ని వుపయోగిస్తారా?

మ:- అవును ఒకమనుష్యుని పూర్తిజీవితంలో కలిగే అలవాటు తొలగిపోదు. అది స్థిరంగావుంటుంది. నాలో లేని వక బాహ్యశక్తిని నేను ప్రార్థిస్తాను. దీని శక్తి యనంతం దీనిలో నేనుకూడా వక భాగమేగాని దీనిది మహద్రూపం. నాది అణుమాత్రరూపం కాబట్టి అది నాలో లేదనే నేననుకుంటాను నాకు దానితో

మేకీభావం కలుగలేదు. నా రూపు ఆవగింజకంటె చిన్నది కాబట్టి నాశక్తి అత్యల్పం. నేనాలాగు చేస్తాను. ఈలాగుచేస్తాను అని అందరును ప్రగల్భాలు పలుకుతూనే వుంటారు. ఇది కేవలం అజ్ఞానం. మనం వక్క పూచిక పుల్లనైన కదలించలేము. మన కేవిధమైన అర్హతలేదు. సర్వశక్తుడైన భగవంతుని సహాయం లేకుండా మనం స్వతంత్రంగా యెంత చిన్నపనినైన కూడా చెయ్యలేదు.

డా:- పూర్తిగా మనస్సు భ గ వ ం తు ని మీద లగ్నం చెయ్యడమే ప్రార్ధన. ఆలాగు లగ్నంచేయడం వల్ల అపుడపుడు అసంప్రజ్ఞాత సమాధ్యవస్థకూడా కలుగుతుంది. మరివకప్పుడు కొడుకు తండ్రిని లేదనుకుంటూ వుండేలాగు జీవుడు భగవంతుని లేదనుకుంటూ వుంటాడు. దీనిని ప్రార్ధన అంటారు. మనస్సును లగ్నం చెయ్యడమే ధ్యానం. ధ్యానం కుదరకపోతే ప్రార్ధన అవుతుంది. అని టాలుస్టాయి చెప్పాడు.

మ- ధ్యానం కుదరకపోవడమే ప్రార్ధన అని నే నంగీకరించను.

భగవంతు డెక్కడనో వైకుంఠంలో వున్నాడని భావించినప్పుడే భగవంతుని దర్శనం లేనందునకు పరితాపం చాల అధికమవుతుంది. అప్పుడు నీ దర్శనం నాకియ్యి అని నేను ప్రార్ధిస్తాను. ఆలాగు ప్రార్ధించడం

వల్ల భగవంతుడు నాదగ్గరకు వచ్చినట్టు నాకు తోస్తుంది. ఇదేభావన. తేజస్సుయొక్క వేగంకంటే భావన యొక్క వేగం చాలా హెచ్చు. ఈ భావ సంబంధంవల్ల భగవంతుడు మనకు చాలా చేరువయే అవుతాడు. అతడు మనకు చాలా దూరంగానువుంటాడు, మిక్కిలి దగ్గరగాను వుంటాడు.

బుద్ధుని సిద్ధాంతం

డా:- ఇదంతా నమ్మకంతో కూడివుంది. మీలాంటి వారికి కొందరికి విమర్శదృష్టి చాలా హెచ్చుగా వుంటుంది. అందువల్ల వారికి త్వరగా నమ్మకం కలగదు. ఇది గొప్ప దురదృష్టమే. నాకు బుద్ధుడే పరమగురువు. బుద్ధబోధయే సర్వోత్తమం "నేను చెప్పినదంతా యధార్థంఅని యెవరు నమ్మగూడదు. ఒక గ్రంథంగాని ఒక సిద్ధాంతినిగాని ప్రమాణ బుద్ధితో యెవరూ విశ్వసించగూడదు" అని బుద్ధుడు చెప్పాడు. ఈలాగు బుద్ధుడొక్కడు తప్ప మరేమత స్థాపకాచార్యుడుకూడా చెప్పలేదు. అన్ని గ్రంథాలను మనుష్యులే వ్రాశారు గనుక నాకే గ్రంథంమీదకూడా గట్టి నమ్మకం లేదు. భగవంతునికికూడా రూపం వుంది అవయవములన్నీ వున్నాయి. అతడు సమస్తలోకాలకు సార్వభౌముడు. అందరి ప్రార్థనను వింటాడు అనే నమ్మకం నాకులేదు. అటువంటి నమ్మకం మీకువుంది.

కాబట్టి మీరు పై మెట్టుమీద వున్నారు.

మ:- నేను పై మెట్టుమీద వున్నానని మీరన్నారు. అది కొంతవరకు మాత్రమే నిజం. భగవంతుడు నాలో వున్నాడు. నేను కూడా భగవంతుని అంశమే అనే నమ్మకం యెల్లప్పుడూ నాకు స్థిరంగా వుండదు. భగవంతునియందు గట్టి నమ్మకం మాత్రం యెల్లప్పుడూ వుంటుంది. నేను అగోచరుడనైన భగవంతుని మీదనే ఎల్లపుడూ పూర్తిగా ఆధారపడివుంటాను. నేను చేయగలిగిన పనుల నన్నిటిని భగవంతుడే చేశాడుగాని నేను చేయలేదు. నేను ముఖ్యంగా కోరుతూవున్న అనేక పనులు నా జీవితంలో నెరవేరాయి. కేవలం నా శక్తి వల్లనే అవి యెన్నటికీ నెరవేరివుండవు. భగవంతుడే వాటిని నెరవేర్చాడు. నేను భగవంతుని ప్రార్థించడం వల్లనే భగవంతుడు వీటినన్నిటిని నెరవేర్చాడు గాని నేనూ అతడూ వకటే అనే ఐక్యానుసంధానంవల్ల భగవంతుడు నా కోరికలను నెరవేర్చలేదనే నేను గట్టిగా నమ్ముతున్నాను. అలాగే నే నందరితోనూ చెబుతూవుంటాను. "నా కష్టాలను భగవంతుడు తెలుసుకొని వాటిని తొలగించాడని చెపితేనే నేను నిజం చెప్పినవాడ నవుతాను. అలాగు చెప్పడమే చాలా సులభమైనపని.

## కర్మసిద్ధాంతం

డా:- భగవంతుడు ధర్మరక్షకుడైన న్యాయాధిపతిగాని దయామయుడు కాడు. మీరు ధర్మపరతుఌ. గనుక మీ కోరికలన్నీ నెరవేరుతున్నాయి.

మ:— మీరు చెప్పింది కర్మసిద్ధాంతం. నా కోరికలన్నీ నెరవేరడానికి తగినంత పుణ్యకర్మను నేను చేసియుండలేదని నాకు బాగా తెలుసును. నేను కర్మసిద్ధాంతాన్నే నమ్మివుండేయడల నా కర్మనాకు సహాయం చెయ్యదు. మనంచేసిన పుణ్యాపాప కర్మల ఫలమును మనం అనుభవించి తీరాలనే సిద్ధాంతమును నేను నమ్ముతునే వున్నాను. నేను పుట్టినప్పటినుంచి ప్రతిక్షణము నా మానసికంగానో వాచికంగానో కాయికంగానో నిరంతరాయంగా కర్మలను చేస్తునే వున్నాను. కర్మ చెయ్యకుండ వక్క క్షణమైన మనం వుండలేము. వెనకచేసిన కర్మను తొలగించడానికిన్నీ యిప్పుడు చేసే కర్మను వృద్ధి నొందించడానికిన్నీ మనం కర్మలను చేస్తునేవున్నాము. కనుక నేను వెనక మంచికర్మ చేశాను. గనక యిప్పుడునూ సంకల్పాలన్నీ నెరవేరుతున్నాయని చెప్పడానికి వీల్లేదు. వెనుకటి కర్మ త్వరలోనే అంతరిస్తుంది. భావికర్మను నేను ప్రార్థనద్వారా కలిగింపవలెను. కేవలం కర్మకు యేవిధమైన శక్తి లేదు. భగవంతుని సహాయం లేకుండా మన శేషపనిని

చేయలేము. మనం అహంకారము మమకారాలతో భగవంతుని ధిక్కరించి యేపనినైనా చేయబోతే అది యెంత చిన్నపని అయినా కూడా నెరవేరదు. నేనువక నిప్పుపుల్లను వెలిగించాలనుకున్నాను. నిప్పుపెట్టెలో అప్పుడు వక్క పుల్ల మాత్రమే వుంది. నేను దానిని గీశాను. కాని గాలివల్ల అది ఆరిపోయింది. లేదా నిప్పుపుల్లను పైకితీయగానే నాచెయ్యి కదలకుండా స్తంభించింది. ఎందువల్ల యీలా జరిగింది. ఇది భగవత్సంకల్పమా? లేక యాదృచ్ఛికమా? లేక నాకంటె ఎక్కువ శక్తిగల మరియొక జీవుని కృత్యమా? మన ప్రాచీనులు ఉపయోగించిన భాషను మనబిడ్డలు ఉపయోగించేభాషను మాత్రమే నేను వుపయోగించగోరుతాను. భగవంతునితో పోల్చిచూస్తే నేనుకూడా చిన్నబిడ్డనే. మనమంతా మహాపండితుల మనుకొని వేదాంతాన్ని పవిత్ర గ్రంధాలను గురించి మాట్లాడుతూ వుంటాము. కాని మనవంతు ప్రారబ్ధముల ననుభవించవలసిన సమయం వచ్చినప్పుడు మాత్రం అంటె యేదైనా ఆపద మనకు తటస్థించినప్పుడు మాత్రం యీ వేదాంతం గీదాంతం మనకేమి అక్కరకురాదు. చిన్నబిడ్డలకంటె మరీ కష్టంగా మనం గోలపెట్టి యేడుస్తాము. లేదా రక్షించు మహాప్రభో అని భగవంతున్ని ప్రార్థిస్తాము. ఈలా యిపుడు అద్వైతం యేమీ వస

చెయ్యదు. జీవ బ్రహ్మల ఐక్యానుసంధానం పటాపంచ లవుతుంది ద్వైతమే మనకు శరణ్యం అవుతుంది. అల్ప శక్తుడను అస్వతంత్రుడనుఅయిన నేను (జీవుడు) నాకంటే భిన్నుడు నాకు స్వామీ సర్వశక్తుడూ సర్వ స్వతంత్రుడూ అయిన భగవంతుని, రక్షించు మహా ప్రభో, అని ప్రార్థిస్తాను. నేనొక్కడనేకాదు. మహా వేదాంతులమని చేప్పేవారందరూ కూడా ఆపత్కాలం లో యీలాగే చేస్తారు.

### బుద్ధుడు ప్రార్థించలేదా?

డా:- మనుష్యులలో మిక్కిలి ధీమంతులైన వారిలోకూడా చాలమంది భగవంతునిమీద గట్టి నమ్మకం కలిగివుండడంవల్లనే వారికి అత్యధికమైన మన శ్శాంతి కలుగుతూ వుంటుంది. వారికి సద్వర్తనం కూడా యేర్పడుతుంది. కాని భగవంతుని సహాయం అవసరంలేకుండా వుండగలిగిన మహదాత్ములుకూడా కొన్ని వున్నాయి. అవి బౌద్ధమత గ్రంథాలు చెపుతున్నాయి.

మ:- బౌద్ధమతం మొదటినుంచి తుదివరకూ అంతా వకటే ప్రార్థనకాదా?

డా:- ప్రతిమనుష్యుడు స్వప్రయత్నం వల్లనే నిర్వాణమును పొందవలెను. అని బుద్ధుడు చెప్పాడు.

బుద్ధుడు ధ్యానం చేసేవాడేగాని ఎప్పుడూ ప్రార్థన చెయ్యలేదు.

మ:- మీరు ధ్యానం అనేదానినే నేను ప్రార్థన అని అంటాను. బుద్ధుని శిలావిగ్రహాల నిర్మాణ పద్ధతిని చూస్తే అతడు ప్రార్థన చేసేవాడని మీరే ఒప్పుకుంటారు.

డా:- బుద్ధుడు దివంగతుడైన తరువాత 400 యేళ్లకు యీ విగ్రహాలన్నిటిని నిర్మించారు గనక వీటినిబట్టి బుద్ధుడు యీలాగుకూర్చొని ప్రార్థన చేసేవాడనడానికి వీల్లేదు.

మ:- మీరు చదువుతూవున్న బుద్ధచరిత్రలో నుంచే బుద్ధుడు ప్రార్థన చేసేవాడని నేను మీకు ధ్రువపరుస్తాను. మీ అభిప్రాయాన్ని మీరు స్పష్టంగా వివరించలేకపోయారు గనక నేను సమగ్రమూ సంపూర్ణమూ అయిన నిర్వచనము మీకు తెలుపలేదు. జీవేశ్వరైక్యాను సంధానంవల్ల నాకు తృప్తికలగలేదు. దానిని వివరించటానికికూడా మనకు శక్తిలేదు. అది వర్ణనాతీతమయినది. అందువల్ల మీకు మిగిలేది నాస్తిక భావంఒక్కటే.

"ఈశ్వరుడు లేడనేనమ్మకము కలిగించే జ్ఞానం అధికమవడంవల్లనూ, నేను సుఖదుఃఖాలను లెక్కచేయనసే గర్వం చాలా హెచ్చడంవల్లనూ, మనుష్యుడు

సంశయావస్థలో పడిపోతాడు. పనిచేయనూలేడు. చేయ కుండాను ఉండలేడు. తానే దేవుడనని చెప్పలేడు. తాను పశుప్రాయుడనని చెప్పలేడు. అతని శరీరమూ మనసూకూడా సంశయంతోనే కడతేరుతాయి. ఈలాంటి మనుష్యులు చావడానికే పుడతారు. పాపాలను చెయ్యడానికి వాదాలను జరుపుతారు. యావజ్జీవం వీరిచేత భగవంతుడు పాపాలనే చేయిస్తూవుంటాడు సత్య నిర్ణయం చేయదగినవాడూ, దివ్య తేజోమూర్తీ, ధర్మ స్వరూపుడు ప్రపంచానికి దిగ్భ్రమను కలిగించేవాడు భగవంతు డొక్కడే" అని వెనక క్రైస్తవుల ముఖ్య గురువైన పోపు వ్రాశాడు.

## వినయం - వినమ్రత

డా:- ప్రార్థనచేయలేని వారిమాట ఏమంటారు?

మ:- అటువంటివారందరితోను మీ బుద్ధునితో కూడా (అంటే మీరు వర్ణించిన బుద్ధుడే కాని నేను వర్ణించిన బుద్ధుడుకాడు) మీరు వినమ్రులై వుండరనే నేను చెబుతాను. భగవంతుని ప్రార్థించడానికి కావలసిన వినయ వినమ్రతలు బుద్ధునికి లేనిమాట నిజమయితే యిప్పటివరకు కూడా యిన్నికోట్లమంది బుద్ధుని బోధనలను అనుసరిస్తూ వుండడం అసంభవం. ప్రపంచంలో మనుష్యులు మొదలయిన సమస్తప్రాణులను నడిపించేది కేవలం మేధాశక్తిమాత్రమే కాదు. అది దీనికంటె

చాలా ప్రబలమైనది. నాస్తికులును సంశయాత్ములును కూడా దానికి లోబడక తప్పదు. కష్టాలు వచ్చినపుడు నాస్తికత్వమూ వేదాంతమూ వారికేమీ సహాయం చెయ్యవు. అపుడు వారికి మనశ్శాంతి కలగడానికి వారిలో లేనట్టిన్నీ అధికమైన స్వాతంత్ర్యమును కలిగి నట్టిన్నీ ఒక మహాశక్తిని వారాశ్రయించక తప్పదు. ఏవిధమైన శక్తిలేదు. అనే గట్టినమ్మకం ఒక మనుష్యునికి కలిగితేగాని అతడు భగవంతుని గురించిన్ని ప్రార్థనను గురించిన్ని తెలుసుకోడానికి అర్హుడుకాడు.

మనుష్యులలో మిక్కిలి గొప్పవారిని మహామేధావులని అందరిచేతా భావించబడేవారుకూడ అనంతమైన విశ్వంలో ఒక యిసుక రేణువుతో సమానులేఅని తెలుసుకోడానికి తగినంత వినయ వినమ్రతలు ప్రతి మనుష్యునికి కలగాలి. ప్రపంచములోని వస్తువులను తెలుసుకోడానికి మాత్రమే మేధాశక్తి వుపయోగిస్తుంది. కాని భగవత్తత్వమును తెలుసుకోడానికి యిది యెంత మాత్రము పనికిరాదు. భగవత్తత్వమును తెలుసుకుంటేనేగాని సంతృప్తి కలగదు. ధనవంతులయినవారికి కూడా అనేకసారులు కష్టాలూ ఆపదలూ కలుగుతునే వుంటాయి. ధనం వుండబట్టి వారు అన్ని భోగాలను అనుభవిస్తారు. వారివలన ధనసహాయం పొందుతూ వున్న వారందరూ వారిని ప్రేమిస్తూవున్నట్టు ప్రవర్తి

స్తారు. కాని కొన్ని సమయాలలో కోటీశ్వరులకుకూడా జీవితం దుర్భరంగానే కనబడుతుంది. ఇటువంటి కష్ట సమయాలలోను భగవత్స్వరూపం లీలగా అందరికీ కన బడుతూ వుంటుంది. ఇదే ప్రార్థన. భగవంతుడే అను క్షణమూ సమస్త ప్రాణులనూ నడిపిస్తూ వుంటాడు.

డా:- ధీశక్తి వల్ల కలిగే లోకజ్ఞానంకంటే అధిక మైనట్టి నిజమైన భగవద్విషయికానుభవం కలగాలని మీ అభిప్రాయం. నాజీవితంలో రెండుసారులు నాకటు వంటి అనుభవం కలిగింది కాని నా కిప్పుడది కలగడం లేదు. స్వార్థపరత్వంవల్లనే దుఃఖం కలుగుతుంది. భౌతిక విషయాలన్నీ అస్థిరాలు-అని బుద్ధుడు బోధిం చాడు.

మ:- ఇదేనండి ప్రార్థన.

## ఆ త్మ హ త్య

డా:- కొందరు బౌద్ధసన్యాసులు ఆత్మహత్య చేసుకుంటే బుద్ధుడు వారిని క్షమించాడు. ఈలాగు ఆత్మహత్య చేసుకోవచ్చునా?

మ:- ఆత్మహత్య చేసుకోవడం కొన్ని పరిస్థి తులలో దోషంకాదు. ఒకనికి కుష్టురోగం వచ్చింది. అది కుదరదని డాక్టరులు చెప్పారు. దానివల్ల అతడు చాలా బాధపడుతున్నాడు. అతనికి పుపచారాల చేసే వారికి కూడా చాల యిబ్బంది కలుగుతోంది. అతడు

ఆత్మహత్య చేసుకుంటానన్నాడు. తిండితినడం నీళ్లు తాగడం మానేసి చనిపోతానన్నాడు. ఈలాగు ప్రాణా లను వదలడానికి తగిన ధైర్యం నీకు వుంటేనే నీవు యీలాగు చెయ్యి, లేకపోతే చెయ్యవద్దుఅని నేనన్నాను. ఎందువల్లనంటే అన్నం నీళ్లు లేకుండా ప్రాణంపొయ్యే దాకా వుండడం చాలాకష్టం. వక్కసారిగా నీళ్లలోపడో విషంతాగో చావడం చాలా సులభంగాని యీలాగు లంఖణాలు పడుండి చావడంలో కలిగే బాధను భరించ డం చాలా కష్టం.- అని నేను చెప్పాను. అతడు జం కాడు. కుష్ఠురోగాన్ని కుదిర్చేమందు వుందని యెవరో చెప్పారు. అతడిప్పుడు మందుపుచ్చుకుంటున్నాడు.

డా:- చావడంలో కలిగే బాధను సహించ గలి గితే చావడానికి ప్రయత్నం చెయ్యవచ్చు నన్నమాట. జబ్బువల్ల కాకపోయినా ప్రాణంమీద విసుగుపుట్టికూడా కొందరు ఆత్మహత్య చేసుకుంటారు.

మ:- తన ప్రాణంమీద విసుగుపుట్టి యెవరూ ఆత్మహత్య చేసుకోకూడదు. /తాను బ్రతికివుండడంవల్ల యితరులకు చాలా యిబ్బందికలుగుతూ వుండేయెడల మాత్రమే ఆత్మహత్యదోషంకాదు. బాధపోవడానికి ఆత్మ హత్య చేసుకోవడం చాలాతప్పు. /యీబాధకంటే ఆత్మ హత్యచేసుకోవడంలో కలిగేబాధ వేయిరేట్లు హెచ్చుగా వుంటుంది. ఒకనికి రాచకురుపు కలిగింది. చాలా బాధ

పడుతున్నాడు. అది కుదరదని అందరూ చెప్పారు. కొద్ది రోజులలో అంచేదెలాగైనా చనిపోతాడు. అలాటప్పుడు నిద్రలోనే ప్రాణంపోయే మందిమ్మని అతడు డాక్టరు నడగటం ప్రారంభించాడు.

డా:- మీరింకా అనేక సంవత్సరాలపాటు జీవించి విస్వామానవసేవ చేస్తారని నమ్ముతాను.

మ:- ఈలోకంలో ఒకనిపని ముగిసిందని వానికితోస్తే వాడు ఆత్మహత్య చేసుకోవచ్చునని మీ రన్నారు. ఈలోకంలో నాపని ముగిసిందని నే ననుకుంటున్నాను గనక నేను జీవించివుండ నవసరంలేదు. (అని మహాత్ముడు పకపక నవ్వుతూ చెప్పాడు).

డా.- మీరు దీర్ఘాయురారోగ్య సంపన్నులుగా వుండాలని అనేక కోట్లమంది ప్రజలు మనః పూర్వకంగా కోరుతున్నారు. మీపని యింకా ముగియలేదు. నేను ప్రార్థనచెయ్యలేను. నా కేకోరికాలేదు.

మ:- ఇంగ్లీషుభాషలో ఒక భావాన్ని వెల్లడించే మాటలు చాలావున్నాయి గనక యీ భావాన్ని వేరు మాటలతో వారు చెప్పడానికి అవకాశంవుంది.

డా:- మీకామాటలు తెలుసునన్నమాట. బతకాలనే కోరిక మనుష్యునకు లేకపోతే అతని శరీరం క్రమంగా శుష్కించిపోయి అతడు చనిపోతాడు.

ఈలాగు సంభాషణ జరిగినతరువాత డాక్టరు గారు మహాత్మునివద్ద సెలవుపుచ్చుకొని మహదేవ దేశాయిగారివద్దకు వచ్చి మహాత్ముని సంతకం నావద్ద యెల్లపుడు వుండాలి అని చెప్పారు. దానికేమి హరిజన నిధికి 5 రూపాయిలు యిస్తే మహాత్ముడు ఒక కాగితం మీద సంతకంచేసి యిస్తారని చెప్పినందున డాక్టరుగారు 5 రూపాయిలు యిచ్చి మహాత్ముడు సంతకంచేసిన కాగితం తీసుకున్నారు.

---

ప్ర తి మ పూ జ.

దేవాలయములు పనికిరావని వాదించి స్కూలు మాస్టరొకరు క్రిందిసంగతులు ప్రశ్నించెను. వాటికీవిధ ముగా జవాబు వ్రాసితిరి.

(1) శ్రీరామచంద్రుని దైవముగా భావించు హిందువుడు దేవాలయములోనికి వెళ్ళి వారి ప్రతిమను జూచుట యవసరమా? క్రియకంటే దర్శనమెక్కువదా?

(2) సజీవమైన మానవమూర్తిని మ్రొక్కిన యెడల వారు దీవింతురుగాని అచేతన మైన ప్రతిమ యట్లుచేయదు. కావున దానిని దర్శించుటవలన లాభమేమి? ప్రతి పలుకనివానికి వ్రాసిన ఫలమేమి?

(3) ఒక హిందువు పూజించుమూర్తి తన జీవిత కాలములో కొన్ని దోషములు చేసి యుండవచ్చును. ఆ దోషములను ఆరాధకుడు కూడ పూజించుటలో ననుస రించి తనమీద వేసికొనుటవలన ననర్థము కలుగదా?

ఇంతకు పూర్వమెన్నియో ఇట్టి శంకలు బయలు చేరెను. వానికి సమాధానములు చెప్పియుంటిని. కాని దేవాలయసమస్య బయలుదేరియుండుటవలన నవి తిరిగి తలయెత్తుటకు కారణమైయుండెను. పైని పేర్కొనిన వారివంటి వారికిట్టి శంకలు నిజముగా బాధింపవచ్చును. వారికి నచ్చినను నచ్చకపోయినను వారి శంకానివృత్తి చేయుటకు నేను చెప్పవలసినది చెప్పవలయును.

హిందువు నెవరికిని దేవాలయమునకు వెళ్లి రామచంద్రుని ప్రతిమను పూజింప వలసిన యవసర ముండదు. కాని ప్రతిమను చూచిగాని యారాధింపలేని వారికి దేవాలయమునకు పోవుట యవసరమగును. అది అంత మంచిదికాకపోయినను నిజముగా మరి యెక్కడ కంటే దేవాలయములో రాముడున్నట్టుభావింతురు. వారి నమ్మకములుమనము చెడగొట్టకూడదు.

మొదటి ప్రశ్నవారు సరిగా నడిగియుండలేదు. దర్శనమునకును ఆచరణమునకును సాదృశ్యము లేదు.

కాని యున్నదని చెప్పునప్పుడు ఆచరణమే మంచిదని నేను వచింపగలను. కానిదర్శనము ఆచరణము పురికొల్పుటకు తోడ్పడును. దర్శనమువలన మనస్సు సుస్థిరమై జీవితము పవిత్రమగును. యుక్తకార్యమునకు దర్శనము బదులుకాదుకాని దానినది పురికొల్పును.

రెండవ ప్రశ్ననడుగుటలో వారుప్రతిమా పూజయందలి సామరస్యమును పాటింప లేకపోయిరి. ఒకరికి మనము మ్రొక్కినప్పుడు మనలను వారు ప్రతినమస్కారము చేయుదురు. ఇదిగౌరవ భావముగాని ఇంతకంటే ప్రత్యేకాధిక్యమందు కనిపించదు. మర్యాదకును యుక్తప్రవర్తనకది లక్షణమై యుండవచ్చును. దేవాలయమునకు పోయి పూజించుటవలన చిత్తశుద్ధికలుగును. చిత్తశుద్ధికొరకు వీని నేర్పరచిరి. భక్తుడు నిర్మలభావముతో దేవునిపూజించును. ఒకరికి నమస్కరించి నప్పుడు వారియందలి మనకు పూజ్యభావము యోగ్యతకలుగును. స్వార్ధరహితులమై మ్రొక్కినపుడు వారి పవిత్రభావము మనకుకలుగును. మానవ మూర్తియందు యేదోనొక దోషముండునుకాని దేవాలయమునందు దోషహితుడైన దేవుని పూజింపవచ్చును. మానవునికి వ్రాసిన జాబులకు ప్రత్యుత్తరము సిద్ధించినను తరచు పరితాపము దుఃఖఫలమే కలుగవచ్చును. దేవునకేవిషయము నివేదించుకొనుటకు కాగితముకలము అక్కరలేదు.

మాటకూడా నక్కరలేదు. శాంతముగా మన మనుకొను భావము లతనికి గ్రాహ్యమగును. దానివలన మనకు చిత్తశాంతి కలిగి దేవుడు మనమొఱ లాలకించిన దానిఫలము వెంటనే కనిపించును. విశ్వాసము వలన నది దివ్యఫలము నిచ్చును. దీనికి ప్రయత్న మక్కర లేదు. దీనివలన పరితాపముగాని దుఃఖముగాని కలుగ దు. దురభిప్రాయము వుదయించుటకు వీలులేదు. దేవా లయములు, చర్చిలు, మసీదులలోని యారాధనయందలి సామాన్యతత్వమును అవిలేఖకుడు గ్రహింపవలయును. నేను దేవాలయములు మసీదులు చర్చిలు మున్నగువాని లో బేధ మిసుమంతయు పాటించుటలేదు. మన మతవి శ్వాసమును బట్టి యవివర్ధిలియున్నవి. అవాఙ్మానస గో చరునిపొందుట మానవుడుచూపు దిజ్ఞాసకిదితార్కాణము.

హిందూమత మందలి యవతార తత్వమును, వారు గ్రహించుడకు యత్నింపలేదని మూడవ ప్రశ్న వలన తెలియును. విశ్వాసముగల హిందువులకు అవతార పురుషుడు దోషరహితుడు కృష్ణుడు హిందువు నకు పరిపూర్ణుడు, విమర్శకు లేమి యాక్షేపించినను దాని నాతడు పాటింపడు. రామకృష్ణ భక్తు లెందరో తమ జీవితములను పవిత్రంజేసుకొని తరించిరి.

అదియెట్లు సిద్ధించునో నాకు తెలియదు అది గూఢమైన రహస్యముగా నున్నది. దానిని రుజువు

చేయుట కాలోచింపలేదు. నేను సత్యమునే భగవంతు డని గ్రహించితిని. రాము నేను సత్య స్వరూపుడని గ్రహించితిని. జీవిత మంధకారబంధురమై కష్టదశయం దున్నప్పుడు రా మ నా మ ము చాలసారులు నన్ను రక్షించెను.

ఆ పవిత్రనామమే నన్ను రక్షించుచున్నది. చిన్న నాడు నాకలవడిన వాసనయో లేక తులసీదాసునందుగల భక్తియో యేది కారణమో చెప్పజాలను. కాని రాముని మహిమ మాత్రము నిజము. నేను చిన్ననాడు రామ మందిరమునకు పోవుచుండెడివాడను. నిజముగా రాము డక్కడ నివసించియుండెనని అప్పుడు భావించి ప్రార్థిం చుచుంటిని దానివలన నాకెన్నియో సంశయములు పాపములు తొలగిపోవుచుండెను. అది మూఢనమ్మ కము కాదు. నావలెనే చాలమంచికి హిందువులకిష్టే యుండును. తన తోడి మతస్థులతో హరిజనుడుకూడా తన కిష్టమున్నయెడల దేవాలయములకు పోయి దేవు నారాధనము చేసికొనవలయునని కోరుచుంటిని. సవ ర్ణులు వారిని దేవాలయములకు రానిచ్చుట ధర్మము మానవ మండలి యందలి ధర్మ జిజ్ఞాసను దే వా ల యారాధన నీడేర్చును. దానియందు మార్పు అవస రము గాని మానవుడు వర్ధిలినంతకాలము అది వర్ధిల గలదు.

---

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 11 | తనకిచ్చెదు | తమకిచ్చెదు |
| | 13 | సంతుష్ఠుడగును | సంతుష్టులగుదురు |
| 8 | 2 | ద్రష్ఠ | ద్రష్ట |
| | 4 | డిటో | డిటో |
| 10 | 10 | వ్యత్యస్థము | వ్యత్యస్తము |
| 11 | 12 | నెపులైన | నపుడైన |
| | 13 | లాకు | నాకు |
| 18 | 3 | విదుద్ధము | విరుద్ధము. |
| 19 | 4 | భ్రష్ఠుడగు | భ్రష్టుడగు |
| 20 | 12 | ఖాధ | బాధ |
| 23 | 1 | మహాతృత్వమును | మహత్త్వమును |
| 25 | 11 | సద్వర్తనములైనపుడు- | సద్వర్తనులైనప్పుడు |
| 27 | 16 | దాంతో | దానితో |
| 28 | 19 | సుపదేసింప | ఉపదేశింప |
| 30 | 4 | సంబందించినవి | సంబంధించినవి |
| 35 | 8 | వానస్తాపములు | మనస్తాపములు |
| | 22 | దుక్ప్రిధము | దృక్పథము |
| 36 | 14 | బైబిలు | బైబిలు |
| 37 | 4 | పద్దతి | పద్ధతి |
| | 21 | క్రైస్తువ | క్రైస్తవ |
| 40 | 10 | అర్జనునకు | అర్జునునకు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 47 | 20 | ప్రనిమనుష్యుడు | ప్రతి మనుష్యుడు |
| 48 | 2 | చిరిత్ర | చరిత్ర |
| 56 | 7 | సామరశ్యము | సామరస్యము |
| 57 | 13 | దిజ్ఞాస | జిజ్ఞాస |

—○—

౬

# శ్రీ గాంధి మహాత్ముని

# నిర్మాణ కార్యక్రమ

## సందేశములు.

నిర్మాణ కార్యక్రమ కేంద్రము వారిచే
ప్రచురింపబడినది.

మొ॥ ప్ర॥ ౧ గ ప్ర॥

1941.

శారదా ప్రెస్, నరసరావుపేట.

వెల 0—0—3.

# విజ్ఞప్తి.

మహాశయులారా!

అహింసాయుతంగా స్వరాజ్యాన్ని సాధించడానికి పదమూడు అంశాలతో గూడిన ఒక నిర్మాణ కార్యక్రమాన్ని మహాత్ముడు సూచించియున్నాడు.

ఈ నిర్మాణ కార్యక్రమంలో హిందూ ముస్లిం ఐక్యత, అస్పృశ్యతా నిర్మూలన, మద్యనిషేధం, ఖాదీ, ఇతర గ్రామ పరిశ్రమలు (గ్రామపరిశుద్ధత, వృత్తివిద్య, వయోజనవిద్య, స్త్రీ జనోద్ధరణ, ఆరోగ్యశాస్త్రవిద్య, రాష్ట్రభాషావ్యాప్తి, మాతృభాషాభిమానం, ఆర్థిక సమత్వం మొదలయిన అంశాలున్నవి.

మరియు వారిటుల చెప్పుచున్నారు.

మన కార్యక్రమాలలో యివన్ని లోపంగా ఉండడమే మన బానిసత్వానికి కారణమంటున్నారు. మనం నిర్మాణకార్యక్రమాన్ని సాధ్యమైనంత వరకు సర్వతోముఖంగా చెయ్యాలి.

అహింసాయుతంగా స్వరాజ్యసాధన, నిర్మాణ కార్యక్రమాన్ని సాధించడంలోనే వుంది.

ఆర్థిక సమత్వం అంటే ప్రపంచసంపత్తిని ప్రతివారున్ను సమానంగా పంచుకోవాలని ఎన్నడును అర్థం చేసుకోగూడదు అయినప్పటికి ప్రతివారికి జీవించడానికి తగిన ఇల్లు, తినడానికి కావలసిన మంచిఆహారం, కట్టుకోడానికి కావలసిన ఖాదీవస్త్రం వుండాలి. క్రూరమైనట్టి ప్రస్తుత ఎక్కువతక్కువ విభేదాలను అహింసమూలంగా తొలగించాలి మహాత్ముని ఆజ్ఞలను శిరసావహించి మన కర్తవ్యమును నిర్వహించుటలోనే మన విజయము మాధారపడియున్నది.

నిర్మాణ కార్యక్రమ కేంద్రము, జొన్నలగడ్డ.
నరసరావుపేట (పోస్టు) గుంటూరు జిల్లా.



గాంధి మహాత్ముని

# హరిజన వ్యాస రాజములు.

## రాట్న సందేశము.

భారతదేశానికిస్వరాజ్యంముఖ్యంగావాలంటే నిర్మాణకార్యక్రమం పూర్తిగా జరగాలి. నిర్మాణ కార్యక్రమం పూర్తిగా జరిగితేనేగాని గ్రామాలకు నిజమైన స్వాతంత్ర్యం కలగదు. నిర్మాణ కార్యాలన్నిటిలోను ఖద్దరు ముఖ్యతమము. భారతదేశానికి మన మందరము ఏ స్వరాజ్యాన్ని కోరుతున్నామో ఆస్వరాజ్యాన్ని సత్యాహింసల మార్గము ద్వారా సాధిస్తున్నాము గనుక అట్టి సత్యాహింసలను ప్రతివ్యక్తి ఎంత దీక్షగా ఆరాధించి ఆచరిస్తే అంతమేర వల్లో ఆతనికి స్వరాజ్యం ఉంటుంది కంటికికనపడని సత్యాహింసలను ప్రతివ్యక్తి ఆరాధించి ఆచరించుట ఎట్లని అనుకోనవచ్చును. దానికి బాహ్యచిహ్నమేదైన ఉన్నదా యని మీరు అడుగవచ్చును హింసాశిక్షితమైన ప్రస్తుత ప్రపంచములో స్థూలరూపము లేనటువంటిన్నీ, బాహ్య చిహ్నమైనటువంటిన్నీ, కంటికిగోచరించనటువంటిన్నీ సత్యాహింసలను ప్రతి

మానవుడు ప్రతి రోజు సేవించి కార్యరూపమున
ఆచరించుట ఎట్లని పరితపించుచున్న రోజులలో
దయామయుడైనట్టిన్నీ, ప్రేమస్వరూపమైనటువంటి
న్నీ దరిద్రనారాయణుడు ప్రతిమానవుడు, జాతిమత
భేదములుగాని స్త్రీ పురుష భేదములుగాని, ధననిర్ధన
భేదముగాని రాజకీయ భావభేదాలుగాని లేని పద్ధతి
లో ప్రతి మానవునికి తలచిన మాత్రాన ఆరాధిం
చుటకు అందుబాటులోనుండునట్లు కార్యరూపమున
ప్రతిరోజు ఆచరించి, ఆనందించి అనుభవించుటకు
వీలుగానుండునట్లు సత్యాహింసలకు స్థూలరూపము
రాట్నమే. కనుక స్థూలరూపములోనున్న రాట్న
సేవయే సత్యాహింసల కార్యరూపమున ఆచరించు
టయని వేరుగా చెప్పనక్కరలేదుగదా.

దేశంలో ప్రజలందరున్ను, ముసలివారున్ను
పడుచువారు, స్త్రీలు, పురుషులు, బిడ్డలు తమ ఇ
ళ్ళలో ప్రతిరోజునా రాట్నాలమీద నూలు వడుకు
తూవుండవలెను. అందరుకూడా ఎల్లప్పుడూ ఖద్దరునే
ధరించవలెను చేతి రాట్నాలమీదను, చేతి కదుళ్ళ
మీదను నూలు వడికేవారికి, ఏకులు చేసేవారికి లేశ
మైనా శరీరమునకు ఆయాసం కలుగదు. కడుపులో
చల్ల కదలకుండా యెవరియిండ్లలో వారు చాల సు
ఖంగా యీరాట్న పరిశ్రమ చేయుచు ఖద్దరు పను

లను చేయవచ్చును ఇందువల్ల భారతీయులు చిర కాలమునుంచి కోరుతున్న స్వరాజ్యం సిద్ధిస్తుంది: వెంటనే గమ్యస్థానముకూడా చేర గలుగుతారు. కనుక దేశంలోని ప్రజలందరు ఎల్లప్పుడు ఖద్దరుబట్ట లనే కడుతూ వుండాలి. తమకు కావలసిన నూలు నంతా తామే స్వయంగా రాట్నాలమీద వడకాలి. దానితో చేతిమగ్గాలమీద వారే బట్టలను నేయిం చుకోవాలి. ఆలాగు నేయబడిన బట్టలను వారు కడుతూవుండాలి. ప్రతి కుటుంబమునకు జీవించుటకు కావలసినది అన్నము, గుడ్డ. ప్రతి యింట్లో తమకు కావలసిన అన్నము నెట్లు ప్రతిరోజువండుకుంటారో, ఇంట్లో వండుకున్న అన్నం ఎంతఆరోగ్యమో, అట్లే అన్నముతో అవినాభావసంబంధముగల గుడ్డకూడ ఎవరికి కావలసినది వారు తమ యిండ్లలోనే తాము తయారుచేసుకొనుటకూడా ముఖ్యావసరము.

—:o:—

## కష్టపడి పని చేసి జీవించుట.

చతుర్ముఖ బ్రహ్మ ప్రజలను సృష్టించి ప్రతి మనుష్యునకును ఒక వృత్తి (క్రతువు) నేర్పరచెను. "దీనివలన నీవు వృద్ధినొందెదవు. నీ కోరికలన్నియు నెరవేరును." తన విధి (క్రతువు) నెరవేర్పకుండ

భుజించువాడు తాను దొంగిలించి తెచ్చిన అన్నియును తినువాడగును” అని భగవద్గీతలో నున్నది. “కష్టపడి చెమటయోడ్చి పనిచేసి ధనమును ఆర్జించి దీనితో భుజింపుము” అని బైబిలులో నున్నది. క్రతువు లనేక విధములు. వాటిలో కష్టపడి పని చేయుట యొకటి. ప్రతి మనుష్యుడును తన ఆహారముకొరకు కష్టపడి పనిచేయు నెడల ఆహార మందరికిని సమృద్ధిగాలభించును. తీరుబడికూడ చాల హెచ్చుగానుండును. జనసంఖ్య అధికమైనదని యెవరు రోదనముచేయరు. ఇప్పటివలె రోగములు, దైన్యము మున్నగునవి యుండవు. అట్టిపనియే మిక్కిలి శ్రేష్ఠమైన క్రతువు లేక యజ్ఞము. మనుష్యులు ఆహారముకొరకుమాత్రమే గాక పరహితార్థము గూడ ఉచితముగా మనస్సును శరీరమును ఉపయోగించి పనిచేయుచుందురు. ఈరీతిగా ప్రతిమనుష్యుడును కష్టపడిపనిచేయు నెడల ధనవంతులు, బీదవారు, గొప్పవారు, కొద్దివారు సవరణలు హరిజనులు అను భేదము లేవియు నుండవు.

ఈఆశయము అలభ్యమైనదే కావచ్చును. కాని దానికొరకు మనముప్రయత్నము చేయకుండ నుండగూడదు. కేవలము స్వోదర పోషణార్థము మాత్రమే ప్రతివ్యక్తియు కష్టపడి పనిచేసిన చాల

మేలుకలుగును. మన కోరికలు తగ్గిపోవును. విందు భోజనములుండవు. ప్రతి వ్యక్తికిని సామాన్యమగు నాహారముమాత్రమే లభించును. మనము జీవించుటకొరకు తిందుము గాని తినుటకు జీవించము స్వకాయకష్టమున కలవాటుపడనివారు కొంతకాలము పనిచేసి చూచినచో వారు దీని లాభమును బాగుగ తెలుసుకొనగలుగుదురు. ఆహారము ఎక్కువ రుచిగానుండును. ఆరోగ్యము చాలా బాగుపడును. చాల వస్తువులు అవసరమని తోచును.

ఇందులకు చెమటయోడ్చి శరీరమును కష్టపెట్టి పనిచేయుట ముఖ్య కర్తవ్యము దానివలననే యీ లాభము లన్నియును కలుగును. మానసిక మేధను వుపయోగించిపనిచేయుటవలన కలుగదు. ఈ పనివలన ఆత్మకు మాత్రమే సంతృప్తి కలుగును. అది ప్రతిఫలము కోరదు గాని శరీరము ప్రతిఫలము కోరును. డాక్టరులు లాయరులు మున్నగువారు ధర్మప్రాయముగు సిబ్బిలో సంఘముకొరకే పనిచేసెదరుగాని పనికొరకు చేయరు. శరీరమునుకష్టపెట్టి పనిచేసి జీవింపవలెనను ప్రకృతినియమమును నెరవేర్చుట వలన సంఘ నిర్మాణమున నిగూఢముగానే పరివర్తనము కలుగును తనకొరకు పనిచేయుము అను సిద్ధాంతమును తొలగించి పరస్పరసేవకొరకు

పనిచేయుట అనుసిద్ధాంతము నేర్పరచుటకైననే మనుష్యుని విజయమాధారపడియున్నది. అపుడు పశుత్వముతొలగి మనుష్యత్వమేర్పడును.

మరల గ్రామముల బాగుపరచుట కష్టపడి పనిజేసి జీవించుటయను సిద్ధాంతమును దాని ఫలితములను బాగుగా తెలుసుకొనుటయే "ఇపుడు పెక్కుకోట్లమంది భారతీయులు గ్రామములలో నివసించుచున్నారు. వారికి ఒక్కపూటయైన కడుపు నిండ తిండిలభింపవలెను. అని మొకరువ్రాసిరి. ఇది నిజమేగాని తన్ను తాను పోషించుకొనుటకు తాను కష్టపడి పనిచేయవలెనను సిద్ధాంతమును ప్రజలు బుద్ధిపూర్వకముగా నెరవేర్చుట లేదను విషయమునుగూడ నిజమే తప్పని సరియైననే వారు పనిజేసెదరు. నిర్బంధము లేనిచో సోమరులుగా నుండవలయుననియే చాలమంది కోరెదరు. గ్రామములో నుండువారిలో చాలమంది పట్టణములకు పోవుట కవకాశమున్నచో వెంటనే వెడలిపోయెదరు నిర్బంధమువలన ఒకని ఆజ్ఞలను నెరవేర్చుటయే బానిసత్వము. మనఃపూర్వకముగా పుత్రుడు తమ తండ్రికి విధేయుడైనచో అతడు పుత్రధర్మమును ప్రశంసనీయముగా నెరవేర్చినవాడగును. విధిలేక కష్టపడి పని చేయుటవలన దారిద్ర్యము, వ్యాధి, అసంతృప్తి

ముఖ్యగునవి కలుగును. మనఃపూర్వకముగా కష్టపడిపనిచేయుటవలనసంతృప్తి,ఆరోగ్యముముఖ్యగునవి కలుగును. నిజమైన భాగ్యము ఆరోగ్యమే గాని బంగారు వెండి నాణెముల రాసులనుచేర్చుటగాదు ప్రజలు తాముభవించుటకొరకు మనఃపూర్వకముగా నితరుల బలవంతము లేకుండ కష్టపడి పనిచేయు పద్ధతిని పరీక్షించుటకే భారత పరిశ్రమల సంఘమేర్పడినది

---

**తమకుకావలసిన ఖద్దరు బట్టలను తామే నేసికొనుట.**

ప్రజలు తమకు కావలసిన బట్టలను తామే నేసికొనుటకును, విక్రయనిమిత్తము ఖద్దరును నేయించుటకును చాలా భేదమున్నది పట్టణములలో నివసించువారిలో ఖద్దరును కట్టగోరువారు ఖద్దరు డిపోలలోకొని కట్టెదరేగాని తాము స్వయముగా నేయరు. ఖద్దరును విక్రయించగోరువారు రైతుల వద్ద ప్రత్తిని కొందురు. పేదవారికి కూలియిచ్చి వారిచేత గింజలు తీయుట, ఏకులు నూలువడకుట, బట్టలు నేయుట, ముఖ్యగు పనులను జేయించెదరు. అటుల తయారుచేయబడిన బట్టలను తమకు నష్టము గాని ధరలకు విక్రయించుదురు సహకార పద్ధతిని మంచి పరిశీలనక్రింద నీపని జరిగినచో ఫలితము

గూడ చాలా బాగుగానే యుండును. తాము కట్టు కొనుటకు కావలసిన బట్టలను తామే నేయగోరు వ్యక్తి యీపనులనన్నిటిని తానొక్కడే చేయవలెను లేదా అతనికుటుంబమువారుగూడ అంగీకరించినచో వారు తలయొక పనియును పంచుకొని చేయుచుం దురు. దీనివలనపనిత్వరగాజరుగును వ్యయముతక్కు వగును. ప్రత్యేకముగాసొంతపొలములున్నసరే అది లేకపోయినను యింటికిచేరికొద్దిపాటిపెరడున్ననుగూడ వానిలోప్రత్తిమొక్కలనుస్వయముగాపెంచి ఆప్రత్తి తో దమ్మిడీవ్యయములేకుండ తీరికవేళలలో ఖద్దరు బట్టలను తయారు చేయవచ్చును. కూలియిచ్చి నేయించవలసినపుడు నూలు వడకువారికే మిక్కిలి హెచ్చుమొత్తము నియ్యవలసియున్నది తక్కిన అన్నిపనులును త్వరగానే జరుగును గాని నూలు వడకుట మాత్రము చాల ఆలస్యమగును. ప్రత్తి మొక్కలను వేయుట ప్రత్తినితెచ్చి గింజలనుతీసి ఏకులను చేయుట నూలువడకి బట్టలునేయుట మున్నగు పనులను స్త్రీలును స్వయముగానే చేసు కొనునెడల మిల్లు బట్టల ఖరీదు కంటె ఖద్దరు బట్టల ఖరీదు హెచ్చుగానుండదు, ఇందులకు కూలియివ్వ వలసినదే వ్యయమగును గాని తాను స్వయముగా అన్ని పనులను చేసుకొనినచో నెట్టి వ్యయమును

లేదు. తమతమ పనులను చేసుకొనుటకు తీరుబడిగా నున్నపుడు మాత్రమే ఖద్దరుపనిచేసుకొనుచుండిన యెడల దీనివల్ల మధ్యవ్యాపారస్తుల సంబంధము కూడ నుండదు. యీపద్ధతివలన గ్రామములలో ఏపుడు తిండిలేకకష్టపడుచున్న బీదవారి ఆదాయము కూడ చాలా అధికమగును.

ప్రచారకులకు ఖద్దరుయందు గట్టినమ్మకమును నైపుణ్యమును నున్నచో గ్రామస్తులందరు కూడ యీపద్ధతినే అవలంభించెదరనుటకు ఎట్టి సంశయమును లేదు. ప్రచారకులు వారికి నచ్చచెప్పవలెను. యీపనులన్నిటినిచేసి చూపించుచు వారికి నేర్పవలెను 'నమ్మకమువలన పర్వతములనుకూడ కదలింపగలుగుదుము.' యిదియెటులున్నను ఇదివరకెవరును యీవిషయమున చాలా శ్రద్ధగాను పట్టుదలతోను పెద్దయెత్తున సక్రమముగా పనిచేసియుండలేదు. భారతిస్పిన్నర్సుఅసోసియేషనువారు దేశమునందంతటను దీనినిగూర్చి గట్టిప్రయత్నము జేసిననేగాని ఆసంఘమునకు సార్థక్యము కలుగదు. ప్రతిగ్రామములలో నివసించెడు ప్రజలకు కావలసిన బట్టలన్నియును ఆ గ్రామములలోనే ప్రజలు తము యిండ్లలో తీరికవేళలలో తయారుచేసుకొనవలెనని యిటీవలనే నీపత్రికలో తరుచుగా వ్రాసియున్నాను.

ఈపని జరిగినచో సీమ గుడ్డల నిమిత్తము విదేశ వస్త్రముల నిమిత్తము వ్యయమగుచున్న కోట్ల కొలది రూపాయలు మన దేశములోనే మిగిలి యుండును. ఇదివరకెన్నడును ప్రత్తిచేలను వేయని గ్రామములలోగూడ ప్రత్తిచేలను పెంచునట్లు రైతులను ప్రోత్సాహపరచుట మొదటిపని. ఇది జరిగిననేగాని ప్రతిగ్రామములోను ఖద్దరుబట్టలు తయారుకావు. వివేకముతో భూములకు తగినఎరువులను వేయుటవలన ఎడారులుగూడ ఫలవంతములగునని మనము తెలిసికొనియే యున్నాము. కావున మన దేశములో నిది సులభసాధ్యమేయగును. దీనివలన ఖద్దరు బట్టలఖరీదు చాల తగ్గును నాణ్యమును మన్నికయు చాల అధికమగును ప్రత్తిరకములు, ప్రత్తి ఏకులు శుభ్రపరచుట, గింజలుతీయుట, ఏకులుచేయుట, నూలువడకుట, ఈపనులలో తేడాలు వీటినిబట్టియే దారముయొక్క బలమును నేయబడిన బట్టలకొలతయును ఆధారపడునని అనుభవమువలన మనమందరమును బాగుగా తెలుసుకొనియే యున్నాము. ప్రతిపనియును చాల సున్నితముగానే జరుగవలెను గాని మోటుతనము పనికిరాదు.

# 11

## నూలువడకడంవల్ల ఆదాయం రెండు రెట్లు హెచ్చు దం చే లా గు.

మన దేశములో 20 యేండ్లనుంచి నూలు వడకుచున్నారు. నూలు వడకడంవల్ల సాలుకు లక్షలకొలది స్త్రీలు జీవిస్తున్నారు. కాని సరిగా నూలువడకేపద్ధతి వారికి తెలియకపోవడం ప్రత్తి మంచిది కాకపోవడం ఏకులు సరిగా చేయబడక పోవడం రాట్నాలుమంచివికాకపోవడం వీటియందు శ్రద్ధ లేకపోవడం మొదలైన కారణములవల్ల వీరు ఒకరోజుకు వడుకగలిగినంత నూలును వడకగలుగు టంలేదు. చాలా తక్కువగా వడకుచున్నారు. ఈ విషయముల సరిచేసుకుంటే రెట్టునూలును వడుకగలుగుతారు. అందువల్ల ఆదాయంకూడ ద్విగుణమౌతుంది. ప్రత్తిని సరిగాయేరి చేతితో గింజలను తియ్యాలి. తరువాత సరిగా ఏకులను చే య్యాలి. వీటితో నూలువడకితే ఆదాయము, దళ ముగాను, నునుపుగాను యుంటుంది. ఒకసారి రాట్నము చక్రాన్ని త్రిప్పి కదురు ఎన్నిమారులు తిరుగుతుందో దానిపై నూలు ఎక్కువ దళము, నునుపు, సన్నతనం, వడుకడంలోవడియు అన్ని ఆ ధారపడతాయి. కదురుబిళ్ళమీద నిలుపుగా గీత గీచి చక్రాన్ని మెల్లగా త్రిప్పుతుంటే కదురు ఎన్ని

మారులు తిరిగేది మనం లెక్కపెట్టగలం. చక్రం ఒకసారి తిరిగేలోపల కదురు కనీసం 100 సారులైనా తిరుగాలి. చాలచోట్ల కదుళ్ళు 60 సారులే తిరుగుతున్నాయి అని శంకరులాలు బ్యాంకరుగారితో చెప్పారు. అందువల్లనే వడికిననూలు చాలాతక్కువగా నుంటున్నది. అది జిగిలేకుండ నుంటున్నది. నూలు కదలకుండా నిలిపేసారి చుట్టు కొలతను తగ్గించడంవల్ల కదురు హెచ్చుసారులు తిరుగుతుంది. గనుక ఖద్దరు ప్రచారకులు రాట్నాలన్నిటినిబాగా పరీక్షించి యీ లోటుపాటులన్నిటిని తొలగించాలి. మొత్తంమీద చూస్తే రాట్నంమీదకంటే చేతికదురు తకిలీ మీద నూలుబాగావచ్చేటట్టు కనుబడుతున్నది. తకిలీ విషయంలో యెక్కువ శ్రద్ధ అవసరంలేదు. క్రొత్తరకం తకిలీని గంటకు 440 సారులు త్రిప్ప వచ్చును. 200 సారులు త్రిప్పితే 266 గజములు వస్తుంది.

—:o:—

యంత్రములను వుపయోగించు విషయమై ఒక సాంఘికవాది మహాత్మునితో సంభాషించుట.

ప్రశ్న:- యంత్రముల మూలద్రోయుటకే గదా! మీరు గ్రామ పరిశ్రమల సంఘము నేర్పరుచుట? (అని ఒక సాంఘిక వాది మహాత్ముని నడిగెను. అపుడు మహాత్ముడు రాట్నముపై నూలు వడకుచుండెను.

మహా:- "రాట్నము యంత్రముకాదా?"

ప్రశ్న:- నేనడిగినది దీనినిగూర్చి కాదు. పెద్ద యంత్రముల గురించి.

మహా:- సింగరు కుట్టుయంత్రమని మీరాయభిప్రాయమా? దానినిగూడ నుపయోగింపవచ్చునని గ్రామ పరిశ్రమల సంఘమునా రంగీకరించినది. వేలకొలది ప్రజలు పనిచేసి జీవించుటకుగల అవకాశమును పోగొట్టునట్టి యంత్రమును తప్ప తక్కిన యంత్రములను వుపయోగింపవచ్చును. యంత్రములకు మనుష్యుడు దాసుడు కాగూడదు. మనుష్యునకు సహాయములగుచు అతని సామర్థ్యమును వృద్ధి నొందించు పరికరముల నన్నిటిని వాడవచ్చును.

ప్రశ్న:- గొప్ప గొప్ప అన్వేషణల గతి యేమి? మీరు విద్యుచ్ఛక్తి నుపయోగించుకొనరా?

మహా:- నేనటుల చెప్పలేదు. గ్రామములలో ప్రతి యింటను విద్యుచ్ఛక్తి అమర్పు గలిగినచో దానితో వారు పనిచేయుటకు నాకెట్టి అభ్యంతరము లేదు. ఇపుడు గ్రామ సంఘముల వారి పశువుల మేతకు పచ్చికబీడులను సృష్టించినట్లు అపుడు ఎలక్ట్రిక్ యినస్టలేషనులను సృష్టించెదరు. విద్యుచ్ఛక్తి యును యంత్రములను గూడ లేకపోయినచో పనిలేనివారేమి చేయవలెను? మీరు వారికి పని

చూపించెదరా? లేక పని లేదనుకారణమున వారిని పరిత్యజించెదరా? యంత్రములలో రెండు రకములున్నవి. సర్వజనుల లాభముకొరకు సిద్ధపరుపబడిన గొప్ప యంత్రములను ప్రభుత్వమువారే యేర్పరచి వాటిని ప్రజల వుపయోగమునకుమాత్రమే వుపయోగించెదరు. అధిక సంఖ్యాకులకు నష్టమున కలిగించుచు కొద్దిమంది మాత్రమే చాల ధనమును సమకూర్చునట్టి యంత్రములును ప్రజలు చేయుచున్న ఉపయుక్తమగు పనిని నిరోధించుటకు నిష్కారణముగా తేబడెడు యంత్రములు మన దేశమున నుండగూడదు. సాంఘిక వాదులైన మీరుగూడ కొన్ని యంత్రములను మాత్రమే అంగీకరించెదరు. గాని అన్నిటినిఅంగీకరింపరు. ముద్రణయంత్రములు ముఖ్యముగా నుండ వలసినదే. రోగులకు శస్త్రచికిత్సచేయు నుపకరణములను గూడ నెవరును చేతులతో చేయజాలరు. కాన నవియు నుండవలసినదే. వాటికి పెద్దయంత్రములు కావలెను. సోమరితనమును పోగొట్టుటకు తగినయంత్రమేమాత్రమేదియును లేదు. మీతో మాటలాడుచునే నేనీ రాట్నంపైనినూలు వడుకుచున్నాను. అందువలన దేశభాగ్యమునకుకొంతచేర్చుచున్నాను. దీని నెవ్వరును మూల ద్రోయజాలరు



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B101 |
| పుస్తకం పేరు | గాంధిమహాత్ముని సత్యాన్వేషణ ప్రబోధములు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | 0 NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 0 38.39 |
| తయారు చేసినది | Rehama |
| పేజీలు విడదీసినది | Kulsama |
| స్కాన్ చేసినది | Ch Ramya |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |